వీరయ్య, పెద్దిభొట్ల

పుణ్యక్షేత్రములు

బెజవాడ, 1927

Record no. 776

Vīrayya, Peddibhoṭla

Puṇyakṣētramulu

Bejavāḍa, 1927

Record no. 776

వీరయ్య, పెద్దిభొట్ల.
పుణ్య క్షేత్రములు / పెద్దిభొట్ల వీరయ్యచే రచియింపబడినది. - 1. కూర్పు.-
బెజవాడ : వాణీ ముద్రాక్షరశాల, 1927.

2, v, 100 p. ;22 cm.

Record no. 776

Vīrayya, Peddibhoṭla.
Puṇyakṣētramulu / Peddibhoṭla Vīrayyacē raciyimpabaḍinadi. -
1. kūrpu.- Bejavāḍa : Vāṇī Mudrākṣaraśāla, 1927.
2, v, 100 p. ;22 cm.
Record no. 776

# పుణ్యక్షేత్రములు







# PILGRIMS' GUIDE.



పెద్దిభొట్ల వీరయ్య, బి. ఏ., బి. ఎల్., చే

యాత్రికుల నిమిత్తము రచింపఁబడినది.



మొదటికూర్పు 1000 ప్రతులు.

బెజవాడ

వాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1927

 వెల 0.4.0

# ఉపోద్ఘాతము.

---

సాధారణముగ దేశయాత్రచేసినవారు తమకు మార్గమందు గలిగిన యనుభవమువల్ల లోకోపకారమును ప్రమాదకారణముల నితరులు దెలిసికొని నివారించుకొనుట కవకాశములను గలిగించుటకు దగు నుపాయమును సూచించుట ధర్మము. యాత్రాస్థలములనుగురించి పెక్కండ్రు తెలిసికొనుటకు గుతూహలము గలవారై యడుగునప్పుడు ప్రత్యేకముగ నొక్కొక్కరికి భిన్నకాలముల నట్టి సమాచారము దెలియజేయుటలోగల కష్టమును వివరింపవలసిన యవసరము లేదు. కాకినాడ వాస్తవ్యులగు శ్రీయుత పెద్దిభొట్ల సుబ్బారాయుడుగారు బెజవాడకు గార్యాంతరమున డిశెంబరు నెలలోవచ్చి నన్ను హరిద్వార ప్రాంతములనుగూర్చిన కొన్ని సంగతులనడిగి తెలిసికొనినప్పుడు నాకుదెలిసిన సంగతులను బుస్తకరూపముగ బ్రచురించిన చాలమందికి నుపయోగపడుననియు నటుల వ్రాయవలసినదిగా హెచ్చరించుటచేత నదివరకు పత్రికలలో నొకటి రెండు వ్యాసములను వ్రాయ నుద్దేశించియుండిన నేను వెంటనే క్రొత్తమును తలపులలో నీపుస్తకరచనకు గడంగితిని. బడిలో పంతులొకరు బెత్తముచే బూని పిల్లలనందర నొక్కసారికొట్టగా నందు కొందరు తామల్లరిచేయనిదే తమ నేలకొట్టిరని యడుగగా పంతులు 'మీరల్లరిచేసినప్పుడు మీకొనను తిరిగి యొకసారివచ్చెదనా'యని యన్నటుల నేను చూచిన పుణ్యస్థలములనుగురించి మాత్రమే పుస్తకము వ్రాయునెడల చూడనివానికి మరి యొకసారి వ్రాయుటయాయని నేను జూచినవి చూడనివికలిపి యీపుస్తకములో జేర్చినాను. సాధ్యమైనవరకు నేను స్వయముగ జూడనిస్థలము

లనుగురించి యట్టివానిని జూచినవారివల్ల సమాచారములు దెలిసికొని వ్రాసియుంటిని. కొంతవర కితరగ్రంథములనుండి ముఖ్యమైన సంగతులను జేర్చితిని. ఒకవేళ పొరబాటున కొన్నిసంగతులు చేర్చబడక వదలివేయబడినచో రెండవకూర్పున సవరణచేయు నుద్దేశ్యముతో ప్రథమమున కొలది ప్రతులనుమాత్రమే యచ్చొత్తించు చున్నాను. ఇందలి లోపములను గనపరచి చేర్చబడవలసిన విషయములను దెలియజేసినవారికి కృతజ్ఞుడనై యుందును.

బెజవాడ,
9—3—27.

పెద్దిభొట్ల వీరయ్య.

# అనుక్రమణిక

× జంక్షను
—— ముఖ్య పుణ్య క్షేత్రము

# పుణ్యక్షేత్రములు

---

దేశయాత్రవలన బుద్ధివికాసమున కెక్కువ అవకాశము గలదు. శరీరారోగ్యమునకు నది ముఖ్యసాధనము. హిందూదేశమున చిరకాలమునుంచి కొన్ని పుణ్యక్షేత్రములు దర్శింపదగినవిగ నెన్నికగాంచి యున్నవి. అందు శ్రీ కాశీరామేశ్వరములు ప్రధానస్థానము నలంకరించుచున్నవి. హిందూదేశమున సాధారణముగ చూడదగిన ముఖ్యస్థలములను గురించి యాత్రికులకు దెలియవలసిన సంగతు లనేకములిందు జేర్పబడినవి. ఇందు మతవిషయకముగ ప్రాధాన్యములేని స్థలములు కొన్ని కలవు. అచ్చట చూడదగిన విశేషములనుబట్టి వానిని చేర్చుటకు కారణము గలిగినది. ఇంతకు యాత్రికులకుగల ధనసౌకర్యము వ్యవధినిబట్టి వారు చూడగల స్థలములను నిర్ధారణచేసికొనవలసియున్నది. అందుకు మనకా పట్టణములను గురించి యచ్చట చూడదగిన యంశములనుబట్టి మన యేర్పాటులను చేసికొనుటకు వీలుగలుగును. కాబట్టి దేశయాత్ర చేయదలచినవా రీపుస్తకమును జదివి యిందలి సంగతులను జేసికొని యేయే ప్రాంతములను జూడవలయునో నిర్ధారణ జేసికొనగలరను దృఢనమ్మకముతో నేను నాకు స్వయముగ తెలిసిన సంగతులు కొంతవరకును ఇతరులవల్ల దెలిసికొనిన సంగతులు కొంతవరకుజేర్చి కావలసిన సమాచారముల నిందు బొందుపరచినాను.

సాధ్యమైనంతవరకు పూర్వాచార పరాయణులకును సంఘసంస్కర్తలకు నుపయోగకరమగు విషయములనిందు దెలుపుచున్నాను. చూడదగిన పట్టణములలో నొకయూరికి మరియొక యూరికిగల దూరము మైళ్ళలో దెలుపబడుచున్నది. రైలు ప్రయాణము లేనిచోట్లగల ప్రయాణసౌకర్యములను గురించి ప్రత్యేకముగ తెలియజేయుచున్నాను. 1926 సంవత్సరమునందలి రేట్లననుసరించి రైలు ప్రయాణమున కెంతకాగలదో

యావివరమును మరియు నొక స్టేషనునుంచి యింకొక మజిలీ స్టేషనుకు నెంతకాలములో ననగా నెన్నిగంటల రైలుప్రయాణమో దెలియగలపట్టీ నొకదానినిందుతో జతపరుచుచున్నాను. తక్కువ వ్యవధికలవారెంత కాలమొక యూరిలో నుండవలసివచ్చునో యావివరములను సూచించుచున్నాను. యాత్రికులు రైలుదిగినవెంటనే యాయూరనెచట బసచేయుటకు వీలుగలవో యందుకొన్ని వివరింపబడుచున్నవి. పాండాలు మొదలగువారు గలుగజేయగల సదుపాయములును వారిలో కొందరివలని బాధకములను ముందుగా గమనింపదగియున్నవి. ఏయేప్రాంతముల నెట్టిభాష వాడుకలోనుండునో టిక్కెట్లనుకొనుచోట్లను బజారులందుగల యిబ్బందులను గుర్తించవలసియున్నది. సామానులను కాపాడుకొనుటకై యెచ్చట నెట్టిజాగ్రతయవసరమైనదియు ముఖ్యముగా దెలియదగినసంగతి. ఆహార పదార్థములలో వివిధ ప్రాంతములలోగల భేదములనుబట్టి యాంధ్రులెట్టి యేర్పాటులతో యాత్రకేగవలెనో యాసమాచారమిందు దెలిసికొనవచ్చును. ఏఋతువులందుప్రయాణమనుకూలమో తెలియదగియున్నది. ఒకయూరి నుండి మరియొక యూరికి ప్రతిదినమనేక రైళ్లుండినను వానిలో నేరైలు మనకనుకూలమో తెలిసికొనవలెను. సాధ్యమైనంతవరకు నూతన స్థలమును జేరునపుడు సూర్యాస్తమయమునకు పూర్వమును సూర్యోదయమునకు బిమ్మటయగునెడల సరియైన బస యేర్పాట్లు చేసికొనవచ్చును.

క్రొత్తచోటునకు రాత్రివేళ చీకటిలో చేరునప్పుడు యాత్రికులకు గలయిబ్బందులను వివరింపవలసిన పనిలేదు. మనకు తెలిసినవారుండు చోటులగు నెడల రాత్రియైనను చిక్కులేదు. తుదకు పాండాలున్నచోటులందు సహితము వసతికిబ్బంది యేవేళలందు చేరినను గలుగదుగాని వారిలో కొందరివల్ల మాత్రము తర్వాత బాధకరముగ నుండగలదు. మార్గమధ్యమున చూడదగిన స్థలములు లేనప్పుడును వసతికనుకూలమైన యూళ్ళు లేనప్పుడును 200, 300 మైళ్ళు ప్రయాణము చేయవలసివచ్చును. అట్టిచోట్ల రాత్రి ప్రయాణములుకూడ చేయవలసిన సమయములుకూడ తటస్థించగలవు.

సాధారణముగా రైళ్ళలో మిక్కిలి వడిగాబోవు మెయిలుబండ్లకు



రేటు హెచ్చుగానుండును. ధనికులగువారి సంగతిగాక సామాన్యజనుల ప్రయాణ సౌకర్యములనే గమనించుటలో నెచ్చటనో పైన దెలిపిన ప్రకారము విధిగా దూరము ప్రయాణము తటస్థించినప్పుడు తప్ప మిగిలిన సమయములలో రెండవరకము యక్స్‌ప్రెసు రైళ్ళెక్కువ ప్రయాణమున కనుకూలముగా నుండును. ఇవిగాక మిక్కిలి దగ్గరస్థలములు చేరుటకు లోకల్ రైళ్ళుండును. ఇవి ప్రతిస్టేషను వద్దనాగగలవు. వేగమున యక్స్‌ప్రెసు రైళ్ళు మెయిలునకు తగ్గవుగాని మెయిలు మిక్కిలి ముఖ్యమైన పట్టణములవద్ద నాగును. యక్స్‌ప్రెసు రైలు లోకల్ రైలువలెగాక కొన్ని చిల్లరస్టేషనులవద్ద ఆగదు. ఏరైలైనను మనము చేరవలసిన గమ్యస్థానమును ఉదయము పదిగంటలలోపల సాయంకాలము 5గంటలు దాటక పూర్వమును మనలను చేర్చునెడల భోజనమజ్జనాదుల కిబ్బంది యుండదు. కొన్నిచోటుల పదిగంటలు దాటిచేరిన నీటికొళాయిలు కట్టివేయబడుటచే వంటకు స్నానమునకు బాధకరమగును. యాత్రికులలో నొంటరిగా పయనము చేయువారును సంన్యాసులగువారును ఎక్కువ యిబ్బంది పొందకపోవచ్చునుకాని కుటుంబముతో బోవువారు అందు పూర్వాచార పరాయణులు విచ్చలవిడిగా ప్రయాణము చేయజాలరు కదా. మూడువందల మైళ్లు దాటినదూరమునకు టిక్కెట్టుకొనుచో రైళ్ళరేట్లలో కొంతతగ్గగలదు. కాని మధ్యమధ్య ఆగుచు ప్రయాణము చేయువారీటిక్కెట్లను కాపాడుకొనుటయేగాక ఆగిన ప్రతి మరుసటిదినము నూరుమైళ్లకు తక్కువ ప్రయాణము చేయగూడదను నిర్బంధమునకు లోబడవలసివచ్చును. అందుచేత యాత్రికులు తామాగదలచిన చోటునకే టిక్కెట్టు తీసుకొనుటమంచిది. ప్రతిచోట టిక్కెట్టుగొనుటలో కొంతయిబ్బందియున్నమాట నిశ్చయమైనను పైరెండురకములయిబ్బందులలో రెండవది భరింపదగియుండును.

కొన్నిరైళ్ళలో జనవత్తిడిలేక ప్రయాణము సుఖముగా జరుగును. కొన్నిరైళ్ళలో చివరకు నిలుచుటకు సైతము స్థలములేక మిక్కిలి యిబ్బందికి లోబడవలసివచ్చును. ఇటిస్థితి ముఖ్యముగా రాత్రి రైళ్ళలో సంభవించును. పగలు వేరుపనులను నిర్వహించుకొనువారు రాత్రులందు

ప్రయాణము చేయుట కొంతవరకును పగలు పన్నెండుగంటలలోపల గమ్యస్థానము చేరగల అనుకూలమగు మరియొక రైలు లేనప్పుడు యాత్రికులందరు గుంపులుగుంపులుగా రాత్రి రైలులో కష్టమైనను ఉదయమునకు చేరగలమను ఉద్దేశ్యముతో నిబ్బందిపడుదురు. ఇట్టిస్థితి అక్కడక్కడ తటస్థించుచుండును. ఆసమయమున నేదైన ఉత్సవమున్నయెడల రైళ్ళస్థితినిగూర్చి యడుగనక్కరలేదు. అట్టిచో దూరము ప్రయాణముచేయువారికెక్కువ బాధకరముగానుండును. ఇట్టిబాధ నివారణ కావలెనన్న ఉత్సవస్థలములకు ప్రత్యేక స్పెషల్ రైళ్ళునడుపుచు నాటికి మామూలు రైళ్ళలో ఉత్సవస్థలములకు టిక్కెట్లు నివ్వకుండిన తప్ప వేరుమార్గము లేదు. ఒక్కొకసమయమున యాత్రికులు రైలువరకు సామానుతో వెళ్ళి రైలులో చోటులేక రెండు మూడు దినములవరకు నిబ్బందిపడుట తటస్థించియుండెను. ఈ రైళ్ళలో కొన్నిచోట్ల స్వల్పదూరములో రెండు మూడు రైళ్లు మారవలసియుండును. కొన్ని పెద్ద రైలు ప్లాటుఫారములందనేక రైళ్లుండుటచేత యాత్రీకులు పొరబాటున ఒకప్పుడు తెలియక ఒకచోటునకు బోవుబండినెక్కుటకు మారుగా మరియొక రైలుబండినెక్కుట సంభవించగలదు. కొన్ని రైళ్ళు ప్రత్యేకముగా యాత్రాస్థలములకని గలవు. ఒక రైలులోనే కొన్నిబండ్లు జంక్షను స్టేషనులలో రెండవ రైలునకు చేర్చబడును. దూరముపోదలచినవారట్టిబండ్లలో నెక్కక యితరబండ్లలో నెక్కినయెడల జంక్షను స్టేషనులో తమ సామానుతో నర్ధరాత్రి వేళదిగి రెండవ రైలులో తిరిగి చోటు చూచికొని యెక్కవలసివచ్చును. ఇట్టి మార్పులవివరము నీపుస్తకములో దెలిసికొనగలరు.

యాత్రకుబోవువారు తమతో తీసికొనిబోవు సామానులు మితముగ నుండునటుల చూడవలెను. గోతము మూట అరసంచికి మించక నౌకరు మోయుటకు వీలుగా నుండవలెను. అనేక స్టేషనులలో ప్లాటుఫారమునుంచి స్టేషను వెలుపలకు చేరుటకు మధ్యకొన్ని వంతెనలెక్కిదిగవలసియుండుట, చాలదూరము నడువవలసి వచ్చుట గలదు. అప్పుడు కూలివాండ్రు హెచ్చురేటు గోరుటయో కూలీలు చిక్కకబోవుటయో తటస్థము కాగలదు. ఒకప్పుడు జంక్షను స్టేషనులలో ఒక రైలునుంచి



మరియొక రైలుకు మారుటకు తగిన వ్యవధి యుండదు. ఎక్కవసిన రైలుకై వెతకుటలో కొంత ఆలస్యము కాగలదు. అందువలన సాధ్యమైనంతవరకు నెవరిమూటవారు తీసికొని పోవీలుండుటమంచిది. కూలి తప్పనప్పుడు యాత్రికులలో నౌకరు కూలివానితో నడచుటకును సామాను వద్ద నౌకరు కావలి యుండుటలో మిక్కిలి జాగ్రతగా నుండవలెను. రైలులో రాత్రులందు ప్రయాణము జేయునప్పుడు జట్టుగా బోవువారందరు నిర్లక్ష్యముగ నుండి నిదుర బోవునెడల ప్రమాదము రాగలదు. ఒకరైనను సామానును గురించి శ్రద్ధతీసుకొనవలెను. మనుష్యులెందరుగలరో సామానులు సకటున మనిషికొక్కరికొక మూటబరువుకన్న హెచ్చుగనున్నటుల అనుమానము గలిగెనేని సామాను ముందుగా తూయించి రసీదు పుచ్చుకొని, ఉండవలసిన సామానుకంటె నెక్కువగుదానికి చార్జి కట్టుట మంచిది. లేనియెడల మధ్యమార్గమున తనిఖీచేయువారు వచ్చి తుదకు ఒకపౌను హెచ్చుతూకముండినను అన్ని సామానులకు టిక్కెట్లివ్వబడిన చోటునుండి చేరవలసిన చోటువరకు గల మైళ్ళకైన చార్జిని వసూలు చేయుదురు. ఈ కారణమువల్ల కూడ నెక్కువదూరమున కొక్కసారి టిక్కెట్టు గొనుటవలన నష్టము గలుగగలదని తెలియవలెను.

వంట చేసికొనదలచిన వారు కావలసిన పాత్రసామగ్రిని తమతో తీసికొని పోవలెను. చాలచోట్ల వసతికి సత్రములుగాని బసలుగానిగలవు. పాత్రసామగ్రి సాధారణముగా దొరకదు. బొంబాయివంటి మహాపట్టణములలో మేడలపైన డాబా గదులలో వంట చేసికొనవలసినప్పుడు బొగ్గు తప్ప కట్టెపుల్లల నుపయోగింప వీలుండదు. అందుకు ఇనపపొయ్యి కావలసియుండును. పూర్వాచారము ననుసరించువారికి నట్టిపొయ్యి పనికిరాదు. దాసిని ప్రతిదినము తోమ వీలుండదు. దానిని ఒకచోటనుంచి మరియొకచోటునకు తీసికొనిబోవుటలో గష్టము కలదు. ఒకదినమునకు కావలసిన బియ్యము మొదలగు వస్తువులుకూడ నుంచుకొనుట మంచిది. ఉత్తరదేశ యాత్రలో నాంధ్రులకెక్కువ కష్టముగలదు. మనకలవాటుపడిన ఉప్పుగాని చింతపండుగాని దొరకదు. మిక్కిలి కష్టపడి హెచ్చువెలకు వెన్నగొని కరగించినగాని మంచి నెయ్యిదొరకదు. ఉత్తరదేశమున

గొన్నిచోట్ల లొట్టిపిట్టల పాలు నుపయోగించెదరు. మంచి నేతికలవాటు పడినవారు ముందు జాగ్రతగలిగి యుండుటకై యీసంగతి తెలిసికొనుట ముఖ్యము. ఉత్తర హిందూదేశమున బజారులో దొరకు గోధుమపిండి కలగలుపుది. అందు జొన్నపిండి మొదలగునవి కలియును మన తెనుగు దేశము వారాపిండి నుపయోగించిన జబ్బుచేయగలదు. కాబట్టి ఈ విషయమై జాగ్రతగా నుండవలెను. మన తెనుగుదేశములో దొరకు పొట్లకాయ మొదలగునవి కంద పెండలము మొదలగునవి సాధారణముగా దొరకవు. ఉత్తరదేశమున మన పొట్లకాయకుబదులు పర్వారుకాయ అనే పిచ్చుకపొట్ల గలదు మన దేశములో మనము తిను నంతకారమును ఉత్తరదేశములో తినునెడల గ్రహణి యేర్పడును. అచ్చట విశేషము తీపి వస్తువులు భుజియించెదరు దక్షిణదేశమున చారు కొలంబు అనబడు పులుసు విశేషముగా వాడుదురు. ఉత్తరదేశమున చపాటీలనబడు గోధుమ రొట్టెలను పెనముమీద వేయించి నిప్పులలోగాల్చి పప్పుపులుసుల సహాయముతో తినెదరు. ఇంకొకచిత్రము గనుడు. మన బియ్యపుఅన్నమును అచ్చటి కాకులుగాని కోతులుగాని కుక్కలుగాని తినలేదన్న నిందతిశయోక్తి లేదు. కోతులు హెచ్చుగానున్నచోట్ల వాని దృష్టియంతయు గోధుమరొట్టెలమీదనే యుండును. అంట్లు తోమువాండ్రు ఉత్తరదేశములో సాధారణముగా దొరకరు. పనిపాటులవాండ్రతో ఆంధ్రస్త్రీలు భాషరాని కారణమున నెక్కువ కష్టపడవలసి వచ్చును. తెనుగువారు విశేషముగా నున్న కాశీ మొదలగుచోట్ల విశేషకష్టము లేదు. రైళ్లలో స్టేషనులలోను యాత్రాస్థలములందును కాఫీరొట్టెబిస్కటుపాలు 'ఛా' అను తేయాకునీరు మొదలగునవి ధరలెక్కువైనను చిక్కును. ఉత్తర హిందూస్థానములో "ఛా" యనబడు తేయాకునీరు విశేషముగా వాడుకలోనున్నది. ప్రతిచోట "ఘరమ్ ఘరమ్ఛా" అనుమాటలు వినబడుచుండును. అనగా వేడివేడి తేయాకునీరని అర్థము. దక్షిణదేశమున ఇడ్డెలి, దోసె, రవ ఉప్పుమావు, కాఫీ ఎక్కువ వాడుకలోనుండును. ఉత్తరదేశమున పశ్చిమ దేశమున దృష్టిదోషము పాటింపబడుటలేదు. వారు విశేషము రొట్టెలపై యాధారపడియుందురు.



పాండాలున్నచోట్లలో సహితము యాత్రికులు సత్రములలో దిగుటగలదు. కొన్నిసత్రములలో దినమునకింతయని అద్దెపుచ్చుకొందురు. ఉత్తరహిందూస్థానములో కొన్నిచోట్ల సత్రములలో నుండువారు ధరావతు 5 రూపాయలు చెల్లించవలెను. వారు సత్రమును వదలి వెళ్లునప్పుడు అద్దెపుచ్చుకొను సత్రములైనయెడల నద్దెమినహాయించుకొని శేషించిన మొత్తమును, అద్దెలేని సత్రములగు నెడల ధరావతుమొత్తమును తిరిగి నిచ్చివేసెదరు. పాండాలు మాత్రము అద్దెరూపకముగా ద్రవ్యము నార్జించరు. వారికిగలపరుమాన పద్ధతులువేరు. అవికొన్ని సాంప్రదాయముల పై యాధారపడియున్నవి. అన్నిచోట్లనుగాని అందరు పాండాలుగాని చిక్కులు పెట్టుదురనుటలేదు. పాండాలకు నర్చకులకు నవినాభావ సంబంధము గలదు. అర్చకున కెంత ముట్టునో యా దేవునికే యెరుక. నదులలో స్నానము చేయుచోట ఘాట్వాలీలకై కొంతసొమ్ము చెల్లించవలసి యున్నది. ఇందులో పాండాలకును ఘాట్వాలీలకు నెవరికెంత చెందునో వారికే తెలియును. ప్రతిచోటను ముందుగా ప్రాయశ్చిత్తదక్షిణక్రింద పాండాలు కొంతవసూలు చేయగలరు. కాశీలో విధిగా మనిషికి 3—8—0 చెల్లించి తీరవలెను. ఇదిగాక మణికర్ణికాఘట్టములో స్నానముచేయుటకై గంగాపుత్రులగు ఘాట్వాలీలకు యాత్రికు లొక్కొక్కరు 1—6—0 చెల్లించక తప్పదు. పాండాల ఇండ్లలో దిగనివారు ప్రాయశ్చిత్తదక్షిణ తప్పించుకొనవచ్చును గాని స్నానఘట్టముదగ్గర ముడుపు చెల్లించితీరవలెను. దీనికితోడు వస్త్రములనుకూడ గంగాపుత్రులు తమకురావలెనని కోరుదురు. యాత్రికులలో నొక్కరైనను వీరికేలరుసుము చెల్లించవలయునని పరిశీలింప సమకట్టరు. చట్టసంబంధముగ నిట్టివసూళ్ళ కవకాశము లేనప్పటికి పాండాలు తమ ప్రాయశ్చిత్తకట్నమును ముందువసూలు చేసికొని వెంటనే గంగాపుత్రుల సంగతి మనకెరుక పరచుదురు. ఒక్కొక్క పాండా కొక గంగాపుత్రుడుండును ఆ గంగాపుత్రుడు సంకల్పము చెప్పవలెనేగాని యితరులనందు జొరనివ్వరు వారియాజ్ఞప్రకారము మనమాఘట్టము వద్ద నడుచుకొననిచో వారు వెనుక ముందు జూడరు. వారిచేతులలోని లాటీలనుజూచి వారి యభిప్రాయము లనుగ్రహించవలెను. యాత్రకుబోవువారు సాధారణముగా వీరితో

పోట్లాడుట కిచ్చగించరు. యాత్రికులకు గొందరు పాండాలెక్కువతొందర గలిగించెదరు. మొదటకొంత మొత్తమునకు యాత్రను పూర్తి చేయించుట కంగీకరించి తుదకు బేరము పెట్టి యెక్కువసొమ్మును జబర్దస్తీతో లాగుటకు బ్రయత్నించెదరు. అట్టివారిబాధ దుర్భరము. పాండాలనుగురించి ముందుగా తెలిసికొననిదే వారియిండ్లకు పోవుటకంటె సత్రములకు బోవుటమంచిది. సరియైన పాండాలు కుదిరినయాత్రికులకు మిక్కిలి అనుకూలమైన పరిస్థితులేర్పడును. పాండాలును గంగాపుత్రులును గోరు రేట్లు హెచ్చయినను చిరకాలముగ నమలులో నుండుటవల్లయాత్రికులు వానిని తప్పించుకొనజాలరు. కొందరు పాండాలు సంపన్నులుగనుండి సౌమ్యస్వభావముగలవారై యాత్రికుల మనస్సుల నాయాసపరచక వారిచ్చినదానితో దృప్తి చెందువారును గలరు. ప్రతిపుణ్యక్షేత్రమును జేరుటలో స్టేషను సమీపింపక పూర్వమే కొన్ని స్టేషనులుండగనే కొందరు పాండాలు పాండాల ఏజెంట్లు యాత్రికులకై రైళ్లువెదకుచుందురు. రైలులో వారి పాండాలనుగురించి వసతులగురించి హెచ్చుగచ్చీలు ప్రారంభించి యితరులనుగురించి నిందించుచుందురు. కొన్నిస్టేషనులలో దిగుసరికివందలకొలది బాటసారులకంటె ఏజెంట్లు పాండాలు హెచ్చుగా యాత్రికుల చుట్టునీగలవలెమూగి తలొకరిని తలొకవైపునకు దీయుటకుజూతురు. ఒక ప్రక్కన కూలీలు చుట్టెదరు ఈమధ్య సామానులకై యాందోళనకవకాశముగలదు. తుదకు నొకపాండాను అప్పుడు స్థిరపరచుకొని గాని యంతకుపూర్వమే నిశ్చయించుకొనిగాని బండికై వెదకుచో మిగిలినఏజెంట్లందరు కసిపోక మసిబూసికొన్న చందమున బండ్లవాండ్లనుబండ్లు తమకుంచవలెనని యాజ్ఞాపించుచు యాత్రికులకిబ్బంది కలిగించుటకు నాలస్యము చేయుటకు ప్రారంభించెదరు. ఇట్టి వడిదుడుకులను జాగరూకతతో కనిపెట్టిసంచరించవలెను. ముఖ్యముగ చాతుర్వర్ణములకు జెందిన హిందువులకే యాత్రతో సంబంధముగలదుగనుక నందు మతాభిమానముగలిగి పూర్వాచారములననుసరించువారినిమిత్తమే యీపుస్తక ముద్దేశింపబడి నప్పటికి నిందలిసంగతులను దెలిసికొనువారెవ్వరైనను యాత్రాభిలాషులు కాగలరనిదలంచి చారిత్రకసంబంధవిషయముల నిందుచేర్చుట తటస్థిం



చినది. ఒక మతమునుగాని యొక సంఘమునుగాని చులకనగా జూచు నుద్దేశము లేదు. పూర్వాచారములందెక్కువ యభిమానముతో నుండుటచే సంస్కర్తలగువారు సంఘ విప్లవ పద్ధతుల ననుసరించకూడదని నా యభిప్రాయము. హిందూమతము నందుండువారు మత సాంప్రదాయములకు భిన్నముగ సంచరింపకూడదని నా కోరిక. కులకట్టుబొట్లయందు సవరణ కావలెనను హైందవులా ప్రకారమొక సంఘముగా నేర్పడి యన్యులతోగలిసి మెలసియుండవచ్చును. కాని అట్టివారు పూర్వాచారము నవలంబించువారిని ఇబ్బందిపరచుట పరిహసించుట పాడిగాదు. అందరికి నొకటే విధమగుబుద్ధి వికాసమేర్పడదు. దేవతాసందర్శనము తీర్థవిధులు మొదలగునవి బ్రాహ్మమతావలంబకులకిష్టము లేనందునను అటుల వంగదేశీయుల ననుసరించువారును పాశ్చాత్య పద్ధతుల నవలంబించువారును ఆంధ్రవిద్యాధికులలోబెక్కండ్రు యౌవనులు బయలుదేరుచున్న సంగతి గుర్తెరిగి యట్టివారికి సహితము నీ పుస్తక ముపయోగపడుటకై వారు జూడదగిన స్థలములనుగూడ కొన్నిటి నిందు చేర్చినాను.

దేశములోనున్న రైల్వేగైడులను పుస్తకములలో మనకు గావలసిన సమాచార మొక్క పుస్తకములో చిక్కుటలేదు. బ్రాడ్షాగైడు హిందూదేశమునకు వర్తించును. మిగిలినగైడులు ఆ కంపెనీల రైళ్ళవరకే విపులముగా నుండును. కొన్ని గైడులలో ముఖ్యస్థలములను గురించిన సమాచారమే లేదు. తుదకు హిందూదేశమునకు వర్తించు బ్రాడ్షాగైడులో సహితము నట్టి సమాచారము లేదు. కాని ప్రయాణములో నీ బ్రాడ్షాగైడుకు సాటియైనది మరియొకటి లేదు. దూరము, జంక్షనుల వివరము రేట్లవివరము నిందు బాగుగా తెలియవచ్చును. కొన్ని వేల స్టేషనులను గురించి యిందుగలదు. మనకు గావలసిన పుణ్యక్షేత్రములను గురించి యందు పరిశీలించి వెతకిన గాని మనకు కావలసిన తఫ్సీలు సమాచారము తెలియుట కవకాశము లేదు. ఈ యాత్రికుల గైడువల్ల రైలుగైడుతో నవసరము పోజాలదు. ఎందుకనగా రైలువేళలు తరుచుగా మారుచుండును. రేట్లును మారుచుండును. ఈ యాత్రికుల గైడు షుమారు రేట్లు తెలిసికొనుటకు ప్రయాణములో నంచనాచూచుటకును ఒకస్టేషనునుంచి

మరియొక స్టేషను కెంత కాలవ్యవధి యగునో తెలియుటకు నుపకరించును. సాధారణముగా నీయాత్రికుల గైడులో కనపరచిన రైళ్ళ కాలనియమము లందుకూడ విశేషము వ్యత్యాసము గలుగదు. కొన్ని నిమిషముల మార్పుగలుగవచ్చును. అందుకై యాత్రికులు తామీ గైడునుబట్టి పోదలచిన చోట్లకు ప్రస్తుతము అమలులోనుండు రైళ్ళ కాలనియమములను మాత్రము ముందుగా తెలిసికొనవలసియుండును. మార్పుదల భాగమును మాత్రము వేరుగవ్రాసికొని యాత్రను సౌఖ్యముగా నిర్వహింపవచ్చును. నదీప్రదేశములందు యాత్రికులెక్కువ జాగ్రతతో మెలంగవలెను.

మనఆంధ్రదేశమున నదీప్రాంతములందు సహితము ఈతరానివారి సంఖ్య హెచ్చుగానుండును. కాశీప్రాంతముల ఈతరానివారు పురుషులలోనేగాక స్త్రీలలోసహిత మరుదుగానుందురు. చిన్నపిల్లలను తలిదండ్రులు నదికి దీసికొనిపోయి వారినడుములకు సొరకాయబుర్రలనుకట్టి వారికి విధిగా నీతనేర్పెదరు. ఈవిధముగా వేసవిలో ప్రతిదినమును ఈతనేర్చుకొను బాలురను బాలికలను చూడవచ్చును. ఇందుకు ముఖ్యకారణము గంగానదిలో మెట్లవద్ద నది కోసి లోతుగానుండుటయు మెట్లు పాచిబట్టియుండుటయు తరుచుగా కాలుజారుటగాని నీటిపై మెట్టుదిగగానే అందకపోవుటగాని సంభవించునపుడు ప్రమాదము లేకుండుటకై అట్టి జాగ్రతతీసికొనబడుచున్నదని తలంచవలసియున్నది. ఆంధ్రులా ప్రాంతములకేగినప్పుడు స్నానముల రేవులలోచాలజాగరూకతతో మెలంగవలెను. గంగాప్రవాహములోబడి యంతులేనివారెందరో యుందురు. ఉన్నయూరివానికి కాటిభయము పొరుగూరివానికి నీటిభయమను లోకోక్తి గలదు. అందుచేత సాధారణముగా నీటిలోదిగుటకు మనవారుఅందు ఈతరానివారు వెరచుటసహజమేకాని కొన్నిచోట్ల మెట్లనుజూచి భ్రమపడవచ్చును.

కాశీలో ఒక్క నారదఘట్టము అసీఘట్టములలోతప్ప ఇతరఘట్టములలో నీటిలో ఒకటిరెండుమెట్లు నడుమువరకువచ్చి మూడవమెట్టున కంతుచిక్కదు. ఈతవచ్చినవారైనను ప్రమాదముచెందుటకవకాశముకలదు నీటిలోమునిగి ప్రవాహవేగమున మెట్టుక్రింద సొరంగభాగమునజేరిన



తిరిగి బయటికిరాపీలుండదు. నారదఘట్టప్రాంతమున అసీఘట్టమున నీటిదరిని మెట్లులేక ఇసుకరేవుగానుండి క్రమముగా లోతుహెచ్చుటవల్ల ప్రమాదములుండవు. ఈఘట్టములలో గేదెలు విశ్రాంతిజెందుచుండుట గలదు. ఇటులనే సముద్రమునందు స్నానముచేయుచోట్ల జగన్నాథం దర్భశయనం చెన్నపట్టణము మొదలగుచోట్ల అలలు హెచ్చుగానుండుటవల్లనేమి దరినే యఘాతమగుటచేతనేమి నీటిజంతువులు కాచియుండుటవల్లనేమి ప్రమాదములు గలుగగలవు. ఈతకొట్టనేర్చియుండు అను వచనము మనఆంధ్రులు గమనింపదగియున్నది. హరిద్వారము మొదలగు చోట్ల ప్రవాహము లోతులేక యతివేగముగనుండును. అట్టిచోట్ల స్నానముచేయువారు జాగరూకులై యుండవలెను. ప్రవాహవేగమునబడి పట్టీలుకొట్టి గాయములుతినువారు గలరు. కొన్నియాత్రాస్థలములలో కోనేరులు పసరుపట్టి స్నానమున కసహ్యముగానుండుటగలదు. భక్తు లట్టిచోట్లసహితము స్నానముచేయుచుందురు. స్నానములనెగవేయు సంస్కారులకిట్టివి చక్కని సాకుగలిగించుచున్నవి. నర్మదా యమునా గంగానదులందలి స్నానఘట్టములను జూచియైన బెజవాడ మునిసిపాలిటివారు కృష్ణలో స్నానఘట్టముల నేర్పాటుచేసిన బాగుండును. యమునలో తాబేళ్లపరిమితముగా నుండును. వీనికి జనులాహారమునకై శనగలు మొదలగు ధాన్యమును సాయంకాలమున నదిలో వేయునప్పుడు వందలకొలది తాబేళ్ళు ఒడ్డుదగ్గరకు వచ్చియుండుట చూడదగియుండును. ఈ నదీప్రాంతములందు పుష్కరకాలములందు యాత్రికులు వేలకొలదిచేరుదురు.

హరిద్వారప్రాంతముల సంకల్పవిధానమున "మాయాపురిమండలే దక్షప్రజాపతిక్షేత్రే హిమాలయదేశే బదరికారామే వాలఖిల్యాశ్రమే కేదారఖండే నీలధారే బిల్వపర్వతే హిమాలయే దక్షిణే హరిద్వారే బ్రహ్మకుండతీర్థే కుశావర్తఘట్టే గంగాతీరే బౌద్ధావతారే కలియుగే విక్రమశక బార్హస్పత్యమానే... అనియు కాశీప్రాంతమున "వింధ్యస్యోత్తరఆర్యావర్తదేశే అవిముక్తక్షేత్రే వారణాసి అసీవరుణయోర్మధ్యే ఆనందవనే మహాశ్మశానే గౌరీముఖే త్రికంటకవిరాజితే భాగీరథ్యాః పశ్చిమతీరే ఉత్తరవాహిన్యాం బ్రహ్మనాళయోర్మధ్యే మణికర్ణికాక్షేత్రే విశ్వేశ్వరాది

త్రయస్త్రింశత్కోటి దేవత గోబ్రాహ్మణ హరిహరగురుచరణసన్నిధౌ... అనియు నచ్చటివారు స్నానఘట్టములందు తీర్థవిధులందు చెప్పుచుందురు.

తీర్థయాత్రల కేగువారు సాధారణముగా పుణ్యస్థలములందలి నదులలోను కోనేరులలోను స్నానమాచరించి అచ్చటి దేవుళ్లను సందర్శించి తీర్థవిధులను నెరవేర్చుటవల్ల పితృదేవతలను తృప్తిపరచు నుద్దేశము గలవారై యుందురు. వేడుకజూచుటకై బోవు సంఘసంస్కారులు పూర్వాచారపరాయణుల బనులజూచి వారిని ఛాందసులని తలంచి తామే కాఫీహోటలునకో పోయి సాపడి బస్తీలలోని గ్రంథాలయములు కచ్చేరీలు మొదలగు నవి పురాతన చరిత్రకాంశములను జూచుటతో కాలమును గడుపుదురు. పూర్వాచార పరాయణులు మతవిధులకు ప్రాధాన్యమిచ్చి లౌకికసంబంధములగు విషయములను గుర్తించుటలో సహితము సంస్కారులకు దీసిపోనివారు కొందరుందురు. కొందరు లౌక్య ప్రపంచమునకు దూరమగువారునుందురు. *పంచ"లు" కారములలో చేరిన రైలు పూర్వాచారమునకు గర్భశత్రువగుటచేత వేళకు సంధ్యావన్దనమునకు గాని మరి యితర విధులకుగాని ప్రయాణములో సామాన్యజనులకు సౌకర్యములు గలుగుట దుస్తరము. ఇదిగాక ఆంధ్రుల ఆచారములు కొంతవరకు ద్రావిడదేశమున దప్ప హిందూదేశమునం దెచటను చూడజాలము. వీరి మడిపద్ధతి యెచ్చటను లేదు. దృష్టిదోషవిధాన ముత్తర పశ్చిమ దేశములగానము. చారుకలవాటు గలిగిన యరవలు పచ్చడికలవాటు పడిన యాంధ్రులు రొట్టెకలవాటు పడిన పశ్చిమోత్తరులు నౌకరి ప్రాంతముల కొకరు బోయినప్పుడు భోజనములం దెట్టి కష్టము గలదో యూహింపవచ్చును. మహారాష్ట్ర బ్రాహ్మణులలో గొన్ని యాచారము లాంధ్రుల కనుకూలమైనవి గలవు గాని యుత్తరదేశము నందలి పద్ధతులు విపరీతముగా నుండును. ప్రొద్దుననే తాంబూలము బంగాళాఆకు వక్క నములువారెందరో గలరు. ఇంతయేల ప్రయాగలో భోక్తలుగ నొక యాంధ్రుడు సలుపుచున్న తీర్థవిధికి కొందరు తాంబూలము నములుచు వచ్చిరని తెలిసికొనిన వింతగలుగకమానదు. మంత్ర

* పంచ"లు"కారములు. జైలు, రైలు, హాస్పిటలు, హోటలు, స్కూలు.



విధానములో సహితము చాల వ్యత్యాసముగలదు. ఉత్తరదేశములో పంజాబు ప్రాంతములదప్ప చక్కని స్వరముతో వేదము నుచ్చరించువారు బహుతక్కువగ నున్నారు. స్నానఘట్టములలో గన్పడు పాండాలు చాలమంది కేశవ అచ్యుత గోవింద అను మూడుమాటలతోనే సంకల్పమును ముగించి స్నానము చేయవలసినదిగా యాత్రికులను గోరుదురు. తద్దిన మంత్రములు చాలమందికి రావు. వారి తద్దిన మంత్రములన్నియు రెండునిమిషములలో ముగించగలరు. కాబట్టి యాంధ్రులు వారి శక్తిని దెలిసికొనగలరు. అట్టి లోపము వారికి మంత్రములువచ్చి బుద్ధిపూర్వకముగా కొంతవదలుట కాదు. వారికివచ్చినవే యట్టివి. కాశీలో మన ఆంధ్రులు కొందరుందురు గనుక తీర్థవిధులకు చిక్కులేదు. మిగిలిన స్థలములలో ఘటకసహాయమువిధియోయవలంబించుట యాత్రికులు గమనింపవలసియున్నది. నదులవద్ద స్నానముచేయుచో సంకల్పవిధానమునకై యచ్చటివారిపై యాధారపడి యాత్రీకులు పోరాదు. పూరీ మొదలగు కొన్ని స్థలములందు మడియనునది అసలేలేదు. దైవభక్తియే ప్రధానముగాగల పూర్వాచారముగలవారు సహితము జగన్నాథములో అన్నప్రసాదము స్వీకరించుటగలదు. కొందరు గోధుమ ప్రసాదమును స్వీకరించెదరు. దక్షిణదేశమున నాంధ్రులకు వెగటుగ దోచు పద్ధతి యచ్చటి బ్రాహ్మణులందుగలదు. ఉదయము స్నానముచేసి కట్టినపంచతో దినమెల్లను వెళ్ళబుచ్చు నభ్యాస మచ్చటివారి కుండుటచేత భోక్తలు నట్టివారిలో నుంచి ఏర్పడుటవల్ల వేరు మడివిధానమును వారవలంబించుట లేనందున ఆంధ్రులకు కష్టముగా నుండును. సంస్కర్తలగు బ్రాహ్మణులు యాత్రాస్థలముల కేగి యచ్చటి నదులలో స్నానముచేయనివారును దేవాలయములలో చిత్తరువులు మాత్రముజూచి తీర్థప్రసాదములను గైకొననివారలు నుండుటలో వింతలేదు. వీరిలో కొందరు నూతన మార్గముల నవలంబించి సత్రములలోను దేవాలయములలోను మొదలగుచోట్ల పూర్వాచారపరాయణులకు కంటకమగు పనులను చేయుటకు సాహసించుచున్నారు. వీరు జైనుల బోధలకు జెవియొగ్గి బౌద్ధమతావలంబకులై హిందూమతములోనున్న వారనవచ్చును. ఆంగ్లేయ విద్యా

ధికులు పాశ్చాత్య పద్ధతుల నవలంబించి సంఘసంస్కరణమును రాచకీయమునకు జోడించి హిందూమతవిధానముల కభ్యంతరమగు పద్ధతుల కవకాశముగలిగించుట శోచనీయము. వీరి పద్ధతులు దేశశాంతికి కారణము కాజాలక కల్లోలమునకు కారణమగుచున్నవి.

ఒక రాష్ట్రమందున్నవారు మరియొక రాష్ట్రమునకు బోవునెడల భాషవిషయమైన చిక్కుగలదు. ఆంగ్లేయ భాష వచ్చినవారితో నాంగ్లేయ భాషవచ్చిన యాత్రికులు మాటలాడ వచ్చును. కాని సాధారణముగా యాత్రలకు బోవువారిలో జాలమంది కాంగ్లేయ భాషరాదు. ఇదిగాక వర్తకులతోను పనిపాటులు చేయువారితోను మాట్లాడుటకు యాత్రికుల కవశ్యము. అట్టివారికి నాంగ్లేయ భాషరాదు. ఉత్తర హిందూస్థానమున తురకము హిందీ బంగాళీ భాషలును, మహారాష్ట్రమున మహారాష్ట్రభాషయు, ఆంధ్రదేశమున తెనుగు, అరవదేశమున అరవము, మలయాళదేశమున మళయాళము, కన్నడదేశమునకన్నడము, గుజరాతు దేశమున గుజరాతీ ముఖ్యముగా జనులు వాడునట్టి భాషలైయున్నవి. మనము కొంత తురకము నేర్చికొని మహారాష్ట్ర దేశమునందలి సామాన్య జనులతో మాటలాడుటకు ప్రయత్నించినను ప్రయోజనము లేదు. ఎందుకనగా సామాన్య జనులకు దేశభాషతప్ప యితర భాషలురావు. ఉత్తర హిందూస్థానములో నుపయోగములోనున్న తురకభాషకు మన ఆంధ్రదేశములోని తురకమునకు వ్యత్యాసముగలదు. వారు మాట్లాడిన మనకర్థముకాదు. మనము మాట్లాడిన వారికి తెలియదు. కొంతవరకు హిందీలో సంస్కృతపద సమ్మేళన మెక్కువగాజేర్చిన యెడల మనఅభిప్రాయములను ఉత్తర హిందూస్థానములో జదువువచ్చినవారు కొంతవరకు గ్రహింప గలుగుదురు. పాండాలలో కొందరు మన భాషలను కొంచెము కొంచెముగా దెలిసికొనిన వారుందురు. వీలువెంట ఇంగ్లీషు తురకము హిందీ మొదలైన కలగలపు మాటలతో ఉత్తరదేశయాత్ర చేయవచ్చును. అన్నిటికి మించిన మూగ సంజ్ఞలవల్ల కొంతకార్యక్రమము నెరవేరగలదు.

ప్రయాణమునకు బూర్వము యాత్రాస్థలము లెవ్వియో వానికి



సమీప రైలుస్టేషను లెవ్వియో దెలిసిన నెక్కువ ప్రయోజనముగలదు. ఒకప్పుడటుల దెలియని యెడల నొక జంక్షనుదాటి కొంతదూరము పోయిన వెనుక నచ్చటివారు మీరు ఫలాని యాత్రచేసివచ్చినారాయని యడుగగా లేదనియు, తెలియలేదనియుజెప్పవలసివచ్చును. తిరిగివెనకకుబోవుటకుడబ్బుదండుగ కాలహరణమగును. అందుచేతయాత్రికులు కొన్నిచూడదగిన స్థలములను ముందుగా దెలియని కారణమున విడచుట సంభవించగలదు. ఈపుస్తకములో ముఖ్యస్థలములను మాత్రము వివరించియుండుటచేత ప్రతి జంక్షనులోగాని యాత్రాస్థలములోగాని అచ్చటివారి నాప్రాంతముల జూడదగిన పుణ్యస్థలములుగాని చారిత్రక ప్రధానమైనవిగాని యున్నవాయని దెలిసికొని వ్యవధి గలవారును ధనవంతులు నటిస్థలములనుగూడ చూడవచ్చును. ధనికులైన వారిలో కొందరుమాత్రమే యాత్రకిచ్ఛగించెదరు. సామాన్య జనులునందు సాధువులు బైరాగులు సన్యాసులు మొదలగు యాత్రికుల సంఖ్య హెచ్చుగానుండును. వీరు వీలైనచో రైళ్లలో టిక్కెట్లతో నిమిత్తము లేకుండను ధర్మాత్ముల సహాయముతోను ప్రయాణము చేయుదురు. లేనియెడల కాలినడకను బోవుదురు. సంపన్నులగువారు మొదటి తరగతి రెండవ తరగతి రైలు బండ్లలోను మెయిలు రైళ్లలోను బ్రయాణము చేయుదురు. మధ్యరకమువారు ఎక్స్ప్రెసు రైళ్లలోను లోకల్ రైళ్లలోను సాధారణముగ మూడవ తరగతి టిక్కెట్లతో బ్రయాణము చేయుదురు. అట్టివారే యెక్కువగనుండుటచేత వారు తెలియక ముందుకుబోయిన యెడల వెనకకు మరలుట కష్టమగుటచేత నిందలి సలహాను శ్రద్ధతో గమనించ వలసియున్నది. ఒకప్పుడు జంక్షను స్టేషనులలో ఒక రైలుబాపతు ఒకటి రెండు రైలుపెట్టెలను రెండవ రైలుకు జోడించుటగలదు. ఇట్టిది వాడీ జంక్షనులో గుంటకల్ నందువాడీమీదుగా బొంబాయికిబోవురాత్రిరైలునకు శెకంద్రాబాదునుంచి బొంబాయికిబోవు రైలుబండ్లలో జరుగుట కలదు. అందుచేత పంఢరపురము పోదలచినవారు శికింద్రాబాదులో జాగ్రతతో సరియైన బండ్లలో నెక్కవలెను. అప్పుడు వాడీవద్ద రాత్రివేళ కష్టపడవలసిన పనియుండదు. అటులనే అంబాలానుంచి హరిద్వార

మునకు లాహోరునుంచిపోవు ప్రత్యేక రైలులో నెక్కునెడల మధ్యమహారాను పూరులోగాని లాస్కారులోగాని రైలు మారనక్కరలేదు.

హిందూదేశమునందలి వివిధ రైళ్ళకువివిధమగు రేట్లుఅమలులోనున్నవి. సాధారణముగా చెన్నపురిరాజధానిలోని రైళ్ళలోమూడవతరగతిటికెట్లకు మామూలురైళ్లకుమైలుకు 0-0-3½ పైసలరేటుగలదు. బొంబాయిప్రాంతముల నట్టిరైళ్లకు 4 పైసలు రేటుగలదు. ఎక్స్ప్రెసు రైళ్ళలో 5 పైసల రేటుగలదు. కాబట్టి ఉత్తరహిందూదేశములో సగటున మనము ప్రయాణము చేయదలచిన మొత్తముమైళ్లకు మైలు 1కి 4పైసలచొప్పున లెక్కవేసిన యాత్రికగు రైలుకర్చు తెలియగలదు. ఉత్తరహిందూస్థానములో 4000 మైళ్ల ప్రయాణమునకు మనిషికి రైలుటిక్కెట్లకు 84 రూపాయలకు మించని లెక్కగలదు. దక్షిణదేశమున ప్రయాణములో మైలుకు 0-0-3½ పైసలేగిట్టును. ఆప్రకారము 1600 మైళ్ల ప్రయాణమునకు మనిషిక రైలుటిక్కెట్లకు 34 రూపాయలకు మించని లెక్కగలదు. అక్కడక్కడ కొంత ప్రయాణము స్వల్పదూరము మెయిలుబండ్లలో చేయుటగలిగినను కొన్నిచోట్ల లోకల్ రైళ్లలోగల తక్కువరేట్లనుబట్టి పై మొత్తము లేర్పడినవి. ఇప్పుడు మ్యాపులో గనపరచిన దక్షిణదేశయాత్ర 2500 మైళ్ళరైలుప్రయాణమునకు మించదనియు ఉత్తరదేశయాత్ర 6000 మైళ్ల రైలుప్రయాణమునకు మించదనియు తెలియగలదు. అందువలన కేవలము రైళ్లకర్చుక్రింద మనిషికి ఉత్తరదేశయాత్రకు 125 రూపాయలును దక్షిణదేశయాత్రకు 50 రూపాయలును చాలునని స్పష్టమగుచున్నది. ఇదిగాక మ్యాపులో గనపరచిన స్థలములలో రైలుస్టేషనులు కానటువంటి వానికై కొన్నిచోట్ల మోటారులును కొన్నిచోట్ల ఎడ్లబండ్లును మిగిలినచోట్ల కాలి నడకయు కావలసియున్నవి. ముఖ్య ప్రదేశములకు 650 మైళ్లవరకు మోటారులమీదను 300 మైళ్లవరకు బండ్లమీద 250 మైళ్లు కాలినడకను ప్రయాణము చేయవలసియున్నది. కొండలప్రదేశములో ముఖ్యముగా కేదారం బదరీ నారాయణప్రాంతములకు బోవువారికి కాలినడక తప్పదు. ఇచ్చట ధనవంతులకు డోలీగలదు. మనిషికిడోలికి కేదారబదరీనారాయణయాత్రలకుసాధారణముగా నూరురూపాయిలుపుచ్చుకొందురు. సర్వీసుమో



టారులు లేనిచోట ప్రత్యేకము మోటారునకు చార్జి హెచ్చగును. బండ్లలో ముగ్గురు నలుగురు మనుష్యులకు కలిసి 120రూపాయలగును. మోటారులకు 5గురు మనుష్యులకు 120 మొదలు 160 రూపాయలవరకు కాగలదు. అనగా మనిషికి రైలులేని ప్రయాణమునకు 60రూపాయలగును. మరియు స్టేషనులనుంచి యాత్రాస్థలములందలి బసకుచేరుటకు బండ్లకర్చు గలదు. అది మనిషికి 20 రూపాయలచొప్పునకాగలదు. సాధారణముగా బండికి ముగ్గురు కూర్చొనవచ్చును. ఒకప్పుడు కొన్ని పెద్ద బస్తీలలో గల దూరమునుబట్టి బండ్లుపయోగించవలసి వచ్చును. ఆ బాపతుమనిషికి పదిరూపాయలగును. జంక్షను స్టేషనులలోను రైలునుంచి స్టేషను వెలుపలకు కూలికిపని గలిగేయెడల ననగా మనిషిమోత సామానున్నయెడల సాధారణముగ నిందులకై 15 రూపాయిలగును. కూలి యవసరములేనియడల నీకర్చు తగ్గును. అటులనే బస్తీలలో నడవదలచిన వారికిని సామానుతో స్టేషనులనుంచి బసలకు నడిచిపోగలవారికిబండ్లకర్చుతప్పగలదు. దూరపు ప్రయాణములకగుమోటారుకర్చు బండ్లకర్చుమాత్రము సామాన్యముగా మధ్యతరగతి యాత్రికులకు దప్పవు. ఈ యాత్ర చేయదలచిన వారు కనీసము 6 మాసములైన యాత్రకై వినియోగించిన గాని పరము లోని ప్రదేశముల నచ్చట చూడదగినవి చూచుటకవకాశము చాలదు. విశ్రాంతిగలవారును ధనికులు నింక నెక్కువకాలము యాత్రలో గడపవచ్చును. ఇందువల్ల మనిషికి భోజనమునకై యాత్రలో గొన్నిచోట్ల పదార్థములు మిక్కిలి ప్రియముగా నుండుటయు కొన్నిచోట్ల చవుకగా నుండుటయు గమనించి చూచిన సగటున 6 మాసములకు 100 రూపాయలు కాగలవు. కాబట్టి దానధర్మములకై వినియోగించు సొమ్మును, కొనువస్తువుల బాపతు సొమ్మును లెక్కలోనికి దీసికొననిచో ప్రయాణమునకు భోజనమునకు కలిసి మనిషికి పై లెక్కప్రకారము 380 రూపాయలగునని తెలియగలదు. మతసంబంధవిధులను యాత్రాస్థలములలో నెరవేర్చుటకు కనీసము మనిషికి 200 రూపాయలు కావలెను. ఇతర చిల్లరకర్చులకు 20 రూపాయలగునని యెంచిన మొత్తము అన్ని బాపతులక్రింద 600 రూపాయలొక్కొక్కయాత్రికు

నకు కావలసిన కనీసమొత్తమని చెప్పవచ్చును. మనిషికి 750 రూపాయల చొప్పున కర్చుచేయునెడల హిందూదేశమునందలి ముఖ్యయాత్రాస్థలములను సౌఖ్యముగ సందర్శించుటకు వీలుగలదని సూచించుచున్నాను. వ్యవధిలేనివారుగాని విశేషము సొమ్ము కర్చుచేయజాలనివారుగాని కొన్ని యాత్రాస్థలములనే చూడగోరువారుగాని యీపుస్తకమును జదివిచూడ దలచినవానిని కాలవ్యయ పరిమితుల కనుగుణముగా నియమించుకొని కార్యసిద్ధిని బొందగలరని నమ్ముచున్నాను.

ఒక స్టేషనునుంచి మరియొక స్టేషనుకు చేరుటకు కాగల కాలపరిమాణము రైలుపట్టాలను బట్టి సమమైన నేల కొండల ప్రదేశమును బట్టి రైలుబండి కేవలము మనుష్యుల కేర్పడినదా, సామానుకూడ చేరవేయునదా అందు ప్రతిమధ్య స్టేషనులవద్ద ఆగునా ఆగదా యనుటను బట్టి యుండును. సాధారణముగ మెయిలుబండి ప్రయాణములో గంటకు 25 మైళ్ళకు తక్కువ లేకుండగను 45 మైళ్ళకు హెచ్చకుండగను గిట్టును. రైలుఆగు స్టేషనులందలి కాలపరిమితికూడ చేర్చి సగుటున 225 మైళ్ళ దూరము ప్రయాణము చేయవలెననిన మెయిలు రైళ్ళలో 5 గంటలు మొదలు 9 గంటలవరకు బట్టునని తెలియగలదు. ఎక్స్ప్రెసు రైళ్ళలో గంటకు 18 మైళ్ళనుంచి 24 మైళ్ళవరకు గిట్టును. లోకల్ రైళ్ళలో గంటకు 14 మొదలు 16 మైళ్ళపరిమితి కాగలదు. కొన్నిచోట్ల వడిగల రైళ్లు కొన్నిచోట్ల నెమ్మదిగబోవు రైళ్ళుండును. మిక్కిలి వడిగలరైలు కాశీనుంచి కలకత్తాకు బోవు మార్గమున గలదు. మిక్కిలి నెమ్మదిగబోవు రైలు బెజవాడనుంచి గుంటకల్‌కు బోవు రైలని చెప్పవచ్చును. మనము చేరగల గమ్యస్థానమెన్ని మైళ్ళో తెలిసికొని మనమెక్కురై లేవిధమైనది తెలిసికొనిన మనమెన్ని గంటలలో చేరగలమో షుమారుగా దెలిసికొనవచ్చును. చాలవరకు మధ్యరకమగు ఎక్స్ప్రెసురైళ్ళు గంటకు 24 మైళ్ళ చొప్పున గిట్టగలవు. రైల్వేగైడులు దగ్గిరనున్నచో యాత్రికులొకయూరినుంచి మరియొక యూరికి నెన్నిగంటలలో చేరగలుగుదురో నికరముగ దెలిసికొనవచ్చును. అప్పటికి నితరకారణములవల్ల రైళ్ళు కొంతఆలస్యముగ జేరవచ్చును. రైలుగైడు లాంగ్లభాషలోనుండుటయు భిన్నరైళ్ళ



కు భిన్నగైడులుండుటయు హెచ్చువిలువగల బ్రాడ్షాగైడు హిందూదేశమంతకును వర్తించుచున్నను సామాన్యముగ యాత్రికులవద్దనుండుటరుదగుటచేత నీపుస్తకములో గనపరచిన దూరములను బట్టి రైలునుబట్టిషుమారుగంటలను దెలిసికొన వీలుగలదు. దృష్టాంతముకొరకు కొన్నిరైళ్ళలో కొన్నిస్టేషనులమధ్య ప్రయాణమెంతకాలము పట్టునో వేరుగా గనపరచబడుచున్నది. మనముచేరవలసిన స్టేషను 200 మైళ్ళకుమించినయెడల వసిగలరైళ్ళలో ప్రయాణము జేయుట వీలుగానుండును. అట్టిప్రయాణము రాత్రులందు తటస్థించగలదు. ఈపుస్తకములో వివరకనపరచిన ప్రయాణ వివరములు సాధ్యమైనంతవరకు ఒకస్టేషనునుంచి చేరవలసినస్టేషను పగలు చేరుటకనువైన రైళ్ళమీద చేయబడగలవి. ప్రయాణమంతయు మెయిలు రైలులో జరుగునెడల 6 గంటలలో జేరగలచోటును 4 గంటలలో జేరగలుగుదుము. గాని 4 రూపాయిలగుచోట 5 రూపాయిలు కర్చగును. ప్రయాణమంతయు ప్రతిస్టేషనులో ఆగుచు సామానువేసికొనురైళ్లలో చేయునెడల 6 గంటలలో చేయగల ప్రయాణము షుమారు 8 గంటలగును. కర్చు 4 రూపాయిలగుచోట 3 రూపాయిలే కాగలదు. కాబట్టి ధనసౌకర్యమునుబట్టి కాలవ్యవధినిబట్టి రాత్రులలో గొత్తచోటు చేరుటలో గల ఇబ్బందులనుబట్టి అనుకూలమగు రైళ్లను యాత్రికులు నిర్ధారణచేసికొనవలసియున్నది. ఈపుస్తకములో కొంతవరకు రైళ్లకాలనిర్ణయము జంక్షనుస్టేషనులకే ముఖ్యముగా కనపరచబడినది. మొత్తమున పరము దాఖలాముఖ్యయాత్రాస్థలము లన్నిటికికాగల కాలపరిమితిని తెలిసికొనునటుల వివరములు కనపరచబడినవి. ఇందువల్ల నెన్నిగంటలు రైళ్లలో యాత్రాకాలము జరుగునో తెలిసికొనవచ్చును తక్కువకాలములోయాత్ర ముగించదలచువారు ప్రతియాత్రాస్థలమునందు కనీస మొకటి రెండుదినముల చొప్పున గడపగలిగినయెడల నెన్నిదినములలో దిరిగి యింటికి చేరవచ్చునో తెలిసికొనవచ్చును. చేరువనున్నట్టియు రైలుస్టేషనుకు దూరమునున్నట్టియు యాత్రాస్థలములనుదూర దేశయాత్రతోబాటుగాక ఇతర సమయములందు వీలుకొంత చూచుట మంచిది. శ్రీశైలం శివరాత్రికిని భద్రాచలం శ్రీరామనవమికి ముఖ్యముగా జూడదగియుండును. అరణ్య

ప్రదేశములను ఉత్సవసమయములందు చూచుట కెక్కువఅనుకూలముగా నుండును. ఇందువల్లదూరయాత్రలో కొంతకాలముకలిసి వచ్చును.

యాత్రకుముఖ్యముగ మిక్కిలి అనుకూలమైన కాలమును ముందుగా నిర్ధారణచేయవలెను. వర్షాకాలమున విశేషముగ వానలు గురియునప్పుడుగాని వేసవికాలమందు ఎండలు మిక్కిలి తీక్ష్ణముగ నున్నప్పుడుగాని ప్రయాణము చాలకష్టముగానుండగలదు. కాబట్టి మాఘఫాల్గుణ మాసములు యాత్రకుముఖ్యమైనవిగ హిందువులు చిరకాలముగ పరిగణించుచున్నారు. ఫిబ్రవరినెలమొదలు ఏప్రిల్నెలలోపల యాత్రముగించువారికి ఎండవానల కష్టములుగలుగవు. కొన్నిప్రాంతములందలి శీతోష్ణస్థితిని బట్టి యట్టి ప్రదేశములను వేసవిలోగాని జూచుటకు వీలుండదు. హిమాలయ ప్రాంతములందు మేనెలప్రారంభమునగాని మంచుగడ్డకరగి కేదారము బదరీనారాయణము బ్రహ్మకపాలము మొదలగు యాత్రాస్థలములకేగుటకు వీలుగలుగదు. అటువలెనే చల్లదనముకై పోదగిన సింలామస్సోరిమహాబళేశ్వరము ఉదకమండలము మొదలగు స్థలములు వేసవిలో వాసయోగ్యములై యుండును. అప్పటికనిచలియధికముగ నుండుటచేత వెచ్చగనుండుటకై కంబళీ సాధనములేనిదే యాప్రాంతముల వేసవి నివాసము కష్టముగనుండునన్న నితరకాలములలో నచ్చటిస్థితిని వేరుగదెలియజేయవలసినపనిలేదుగదా. వేసవిలో కాశీ ప్రయాగ గయా అయోధ్య ప్రాంతములందలి ఎండమిక్కిలి తీవ్రముగనుండి దుర్భరముగనుండును. మండు వేసవిలో గొన్నిచోట్ల స్నానపానములకుదగు జలవసతియుండదు. వర్షాకాలములో బురదనీరుండుటచేనది అనారోగ్యకరముగానుండును. వేసవిలో పగటి రైలుప్రయాణముముఖ్యముగా ఉత్తరహిందూస్థానమున మిక్కిలి కష్టముగానుండును. ఎండకు రైలుపెట్టెలు మిక్కిలివేడిగలవై యుండుటచేత నట్టిరైళ్ళలో ప్రయాణముకష్టముగానుండును. వేసవియందు రాత్రి ప్రయాణముసౌఖ్యమైనను నిద్రకుబాధకరముకాగలదు. అప్పుడు సామానుకై హెచ్చుజాగ్రతకావలసియుండును. కాబట్టి ఉత్తరహిందూదేశయాత్ర ఒక సంవత్సరమందును దక్షిణహిందూదేశయాత్ర మరియొకసంవత్సరమునందు చేయునెడల నెండవానలబాధ యాత్రికులకుదప్పగలదు. ఇదిగాక



చలికాలమున కొన్నిప్రాంతముల మహామారిమొదలగు బాధకములు కూడనుండును. ఉత్సవసమయములందు చేరువపల్లెలలోదిగి యచ్చటనుండి యాత్రాస్థలములను జూచుటకై మాత్రము పోవలయును. లేనియెడల వసతికిగల ఇబ్బందులకుదోడు అంటువ్యాధులు ప్రబలుట కదిసమయముగ నుండును. ఇంతకు నట్టిసందడి సమయములందు స్వామిదర్శనము లభించుట దుస్తరము. ముక్కోటిఏకాదశికి శ్రీరంగమునకు కృత్తికకు తిరుత్తనికి బ్రహ్మోత్సవమునకు తిరుపతికి గరుడసేవకు కంచికి రథోత్సవమునకు జగన్నాథమునకు కుంభమేళకు హరిద్వారమునకు శివరాత్రికి శ్రీశైలమునకు శ్రీరామనవమికి భద్రాచలమునకు లక్షలకొలది జనులువచ్చుచుందురు. ఈఉత్సవసమయములందు ప్రత్యేకమురైళ్ళు వేయబడుటగలదు. కానిజనవత్తిడి విశేషమై రైళ్ళుక్రిక్కిరిసియుండి ప్రయాణము కష్టముగానుండగలదు. పుష్కరకాలములందాయానదీప్రాంతములంగల పుణ్యక్షేత్రములందు తీర్థవిధులునెరవేర్చుటకు లెక్కకుమించినజనులు రాగలరు. కాబట్టి యాత్రలకేగువారు పైసంగతులను గమనించియాత్రాకాలమును నిర్ధారణచేసికొనుట ముఖ్యమై యున్నది.

1913వ సంవత్సరం మార్చినెల ఆంధ్రభారతిసంచికలో నాచే వ్రాయబడిన 'పుణ్యక్షేత్రములు, ఉత్సవములు' అనువ్యాసమును దీనికనుబంధముగా జేర్చుచున్నాను. కొన్నిక్షేత్రములనుగురించిన స్థలపురాణగాథలును క్షేత్రమాహాత్మ్యములును నే నీ పుస్తకములో గ్రంథవిస్తరభీతిచే చర్చింపదలచలేదు. మరియు వింధ్యపర్వతము నగస్త్యుడు సాష్టాంగపడునటుల చేసినటుల మొదలగునంశములను గురించి పామరజనాభిప్రాయమెటులుండినను నవీనకాలమునందలి మనకు దెలిసిన సంగతులనుబట్టి విద్యాధికులగు సంస్కర్తలు పరిహసించుట కవకాశముగలదు కనుక పురాణగాథల నిచట విస్తరించలేదు. ఆగ్నేయాస్త్రము సమ్మోహనాస్త్రము మొదలగునవి పూర్వకాలమునందుండెనను సంగతులను జర్మనీయుద్ధమువరకు నమ్మనివారు గలరు. పాతికసంవత్సరములకు పూర్వము పుష్పకవిమానమటయని వెక్కిరించిన బ్రాహ్మసమాజకు నెరుంగుదును. కాని పాశ్చాత్యవిమానములు ప్రారంభముగాక పూర్వపుసంగతి యగుట

చేత నామిత్రుడు పరిహసించియుండెను. కాబట్టి కొన్నిపుణ్యక్షేత్రములలోగల చిత్రములకు శాస్త్రసమాధానము లుండగలవనియు కొన్నిమన యూహలకతీతములగునవై ప్రస్తుతకాలము నందలి లోకానుభవమునకుభిన్నమై నమ్ముటకు వీలుగానిమాట నిజము. అంతమాత్రముచేత క్షేత్రమహాత్మ్యమును స్థలపురాణములను గురించి విపరీతాభిప్రాయములు చెందరాదనియు భక్తులకు మనశ్శాంతికై యేర్పడిన వానియంతరార్థమును గ్రహించి జ్ఞానులగువారు తగినరీతిని సంచరించగలరనియు దలంచుచున్నాను. నమ్మకమువల్ల నెందరో ఆరోగ్యముజెందుచున్నారు. అట్టివారికి నమ్మకముగలిగించువిధానమును గురించి పరిశీలించుట సాధారణముగా నుండదు. పుణ్యక్షేత్రములందు మహాత్మ్యముకలదనినమ్మువారిని అట్టినమ్మకము లేనివారు బాధింపకుండుట మేలు. మ్రొక్కుబడుల విధానము నమ్మకముపై యాధారపడియున్నది. ఎందరో తిరుపతివెంకటేశ్వరునికో సుబ్రహ్మణ్యేశ్వరునికో మ్రొక్కుకొని వారి యాపదలను నివారణబొందుటగాని పొందినటుల దలంచుటగాని లోకానుభవములోనున్నది. యాత్రలకేగువారు పుణ్యక్షేత్రములను దర్శించి దేహారోగ్యమును మనశ్శాంతినిబొందుటయు నితరములగు మనోఫలసిద్ధిని చెందుటయు ననేకులకు దెలిసినసంగతి. అట్టియాత్రార్థులనిమిత్తమీపుస్తకముపయోగకారికాగలదని నమ్ముచున్నాను.

---

## అనుబంధము.

'చిరకాలమునుండి హిందూదేశమున కాశీ రామేశ్వరము మొదలగు పుణ్యక్షేత్రములకు నన్నివైపులనుండియు యాత్రికులు బోవుచున్నసంగతి తెలిసిన విషయమైయున్నది. తురకలకు మక్కాయాత్రయు క్రైస్తవులకు జెరూసలేము యాత్రయు నెట్టివో హిందువులకు కాశీయాత్రయు నట్టిదే. పూర్వకాలమున రైళ్లుగాని కాల్వలుగాని లేనప్పుడు యాత్రస్థులు పాదచారులై యుదయమునం దామడయు సాయంకాలమం



దామడయు ప్రయాణము జేయుచు మార్గమధ్యమందేర్పడిన సత్రములను చలివేంద్రల నుపయోగపరుచుకొనుచుండెడివారు. దేశయాత్రలవల్ల గల్గు లాభము లనంతములు. పావనగంగాజల స్నాన పానములవల్ల జనుల కెట్టి సౌఖ్యముగలదో యాధునికశాస్త్రజ్ఞులు నుడువుచున్నారు. దేహారోగ్యమునకును మనశ్శాంతికిని దివ్యౌషధమనదగు యాత్రలను సేవించుటకు భక్తిప్రధానమని వైద్యశాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. ప్రపంచములోనెల్లచోట్లను పామరజనులకు మూఢవిశ్వాసము మెండు. వర్ణాశ్రమ ధర్మముల కాటపట్టగు హిందూదేశమునం దాచారములకు ప్రాముఖ్యత యుండుట సహజమై యున్నది. విగ్రహారాధనయందు చిరకాలముగ విశ్వాసముగలవారు దివ్యక్షేత్రములకు బోవు నాచారము గలిగి యుండుటలో వింతలేదు.

హిందూ సంఘమునందు కలుగుచున్న మార్పుల కనుగుణముగ తీర్థయాత్రల ప్రకరణము నందును మార్పులు గలుగుచున్నవి. రైళ్ళవ్యాప్తివల్ల పాదచారులై కాశికి బోవలసిన యవసరము లేదుగదా. పూర్వమున సంవత్సరముల కొలది కాలముపట్టినయాత్ర లిప్పుడు కొన్నిదినములలో నెరవేర్ప గలుగుచున్నాము. మతాచారముల యందలి భక్తిలో సహితము పూర్వకాలమునకును ఇప్పటికిని వ్యత్యాసము కన్పట్టుచున్నది. ఇది నవీన నాగరికతా ప్రభావమువల్లను క్రైస్తవమత బోధలవల్లను పాశ్చాత్యుల సంసర్గమువల్లను చాలవర కేర్పడియుండవచ్చును. స్వజాతి మతాభిమానములు నశించుటగాని శిష్టాచార సాంప్రదాయము రూపుమారుటగాని యభివృద్ధియగునో కాదో తెలియదగియున్నది. పాశ్చాత్యదేశములందలి మంచి పద్ధతులను హిందువు లవలంబించ కూడదనిగాని మన యాచారములలో చెడ్డవానిని సంస్కరించ కూడదనిగాని నేనను. అనవసరముగ నిర్హేతుకముగ మన శిష్టాచారముల నేల త్యజియింపవలయునో నాకు బోధపడుటలేదు. మహమ్మదీయుల నింటపుట్టి యచ్చట పెరిగిన వాడల్లాను పూజించి నమాదు చేసినగాని, క్రైస్తవ మతమున జన్మించిన గ్లాడ్స్టను మంత్రి క్రీస్తు నారాధించినగాని హిందువుడు తన మతాచారముల ప్రకారము సంచరించినగాని వీరిలో నెవ్వరును నిందా

ష్ఠులు కాజాలరు. మతము లేవైనను భక్తిజ్ఞాన మార్గము లందరికిని గలవు. ప్రతిమతమువారును తమమార్గము తిన్ననైనదనియు నదియే మోక్షదాయకమనియు వాదించవచ్చును. కాని అన్యమతములకును హిందువుల మతమునకును ముఖ్యమైన భేద మొకటికలదు. ఇతర మతములవారికిని వారి యాచారములకును సంబంధము లేదు. హిందువుల మతాచారములలోనుండి మతమును ఆచారములను విడదీయుట సులభమైన పని గాదు. కాబట్టి హిందువుల యాచారపద్ధతులు దుష్టములని స్థిరపడువరకు నాచరణీయములని స్పష్టమగుచున్నవి. నవనాగరికత గలవారు మనమతమునందు విగ్రహారాధన యున్నదనియో మరియేకారణము చేతనో పాశ్చాత్య మతముల మిడిమిడి జ్ఞానముతోను మన శాస్త్రజ్ఞానము శూన్యమగుటచేతనో మన మతమునందలి నమ్మకము చెడినవారై యామతమును మతములో చేరియున్న మనశిష్టాచారములను ధ్వంసముచేసి నూతనాచారములను ప్రారంభింప సమకట్టుచున్నారు.

పాశ్చాత్యుల యాచారములు వారి మతముతో సంబంధించక వంశపారంపర్యా ఆచరింపబడుటచేత వారి మతములు మారినను ఆచారము మారనంతవరకు వారి సంఘములకు బలముతగ్గుట కవకాశము లేదు. హిందువుల కన్ననో మతముపోవచ్చును. మతముతో మతములోనియాచారములు పోవుట నిశ్చయము. కాని నూతనాచారములను పాశ్చాత్యులనుగాని మరి యితరులనుగాని చూచి యవలంబింపవలెనన్న వీరి తరము కాదు. అది వీరితరములో కాదగిన పనిగాదు. అనేకతరములనుండి పారంపర్యముగా వచ్చుచున్న యభ్యాసములే యాచారము లనంబడును. అందువల్లనే హిందువుల మతాచారముల యందెక్కువ ప్రాముఖ్యతగలదని మాక్సుముల్లరు మొదలగు పాశ్చాత్యులు వ్రాసియున్నారు.

మన మతాచారములు చాలవరకు శరీరారోగ్యమునకును మన శ్శాంతికి నేర్పడినవై యున్నవి. పుణ్యక్షేత్రములును తీర్థయాత్రలును భక్తియుతములై యట్టిపనులకే సహకారు లగుచున్నవి. ఆధునికశాస్త్రజ్ఞులు



పాశ్చాత్యదేశములవారికి నిండ్ల నూడ్చవలసిన దనియుకడుగ వలసినదనియు సముద్రస్నాన మప్పుడప్పుడు చేయవలసినదనియు కొన్నినదుల జలములయందు విశేష లక్షణములు గలవనియు నిప్పుడిప్పుడు బోధపరచుచున్నారు. మన దేశములో నెందరు తాము వసించు నిండ్లలో చాపలను పైన క్రిందనల్లించి రోగాంకురములకు తమయిండ్ల నాకరము చేయుచున్నారో, యెందరు మన స్నానముల పద్ధతి హేయమని నిందించుచు పాశ్చాత్యుల పద్ధతుల నవలంబించుచున్నారో వివరింపజాలను. మన దేశములోనున్న పుణ్యక్షేత్రములు చాలవరకు ప్రాచీనములు. అట్టిక్షేత్రములందెద్దియో భక్తిజనకమగు విశేషమును మనపూర్వులు జేర్చియున్నారు. కాశియందలి గంగకును జగన్నాథమునందలి భాండాశనమునకును మంగళగిరి పానకమునకును చిదంబర రహస్యమునకును రామేశ్వరమునందలి సేతువునకును హిందువులందరు నాధిక్యత నిచ్చుచున్నారు. తిరుపతి శ్రీరంగం మొదలగు ననేక క్షేత్రములయందు మహాత్తుగలదని పామరులు నమ్ముచున్నారు. మతాచారములెంత సాంకర్యమునకు లోబడుచున్నను ఇప్పటికి తీర్థయాత్రలకు బోవువారి సంఖ్యతగ్గుట లేదు. రైళ్ళవల్ల పూర్వముకంటె హెచ్చుగ జనులు పుణ్యక్షేత్రములకు బోవుచున్నారు. కొన్ని క్షేత్రములలో జరుగు నుత్సవదినములు ముఖ్యముగ నెంచబడి యాదినములం దాక్షేత్రములకు పెక్కండ్రు యాత్రస్థులు పోవుచుందురు. ఒక్కొకపండుగకు నొక్క క్షేత్రోత్సవములు ప్రధానముగ నున్నవి. ప్రతిసంవత్సరము సకటున మంగళగిరి యుత్సవమునకు రైళ్ళమీద పదివేల జనులు కాళహస్తి యుత్సవమునకు 15 వేలజనులును కోటప్పకొండకు 15 వేల జనులును పొన్నూరుతిరణాలకు 30 వేలజనులు ఆకిరిపల్లి ఉత్సవమునకు 5 వేల జనులును ఇంక నిదేవిధముగ తిరుపతిమొదలగు క్షేత్రములకును కొన్నివేలకొలది జనులు రైలుమార్గముగ వచ్చుచున్నట్లు రైలువారి లెక్కలవల్ల కన్పించుచున్నది. ఇదిగాక బండ్లమీదను పడవలమీదను పాదచారులుగను నెన్ని వేల జను లీయాత్రలను ప్రతిసంవత్సరము చేయుచున్నారో తెలిసికొనజాలకున్నాము. ఇప్పటికిని మతాచారములు సామాన్య జనులయందు నిలిచియున్నవిగాని విద్యాధికు లనంబడు వారిలో

ఔకృంద్రకు మతమునందు విశ్వాసము తగ్గి మతాచారము లడుగంటినవి. కాశీకిబోయి గంగలో స్నానము చేయకవచ్చిన మామిత్రుల నేనెరుంగుదును.

ప్రజలెప్పుడును మూఢవిశ్వాసము లందే మునిగి యుండవలెనని గాని పుణ్యక్షేత్రములకేగి యుత్సవాదులను సందర్శించుటే యవసరమని గాని యాత్మనిబ్బరము కలిగి జ్ఞానమార్గమున సంచరించు వారిని భక్తి మార్గము వదలకూడదనిగాని నేను జెప్పుటకు సాహసించను. మతవిషయచర్చలందు ప్రవేశించుటకు నే నిచ్ఛగించను. ఆచార వ్యవహారములను గురించినంతవరకు పుణ్యక్షేత్రములు తీర్థయాత్రలు నుత్సవాదులును పామరుల కెటుల నుపయోగబడుచున్నవో నవీనకాలమందు వానిస్థితి యెటులున్నదో తేటయజేయుచు, మతమేమైనను మనయాచారములందు లోపములున్నచో సవరణ చేయుటగాని త్యజించుటగాని కర్తవ్యమనియు నంతవరకు వానినే శిరసావహించుకొని యాచరించుట ప్రతి యార్యునకు ముఖ్యధర్మమని దృఢముగ నేను నమ్ముచు నింతటితో ముగించుచున్నాను.''

---

# పుణ్యక్షేత్రములు

## ఇతర ముఖ్యస్థలములు.

**అజంటా:**—మన్మాడునుంచి ఢిల్లీకిబోవు రైలుమార్గములో పచోరా స్టేషన్ దగ్గిర దిగి అచ్చటనుంచి చిన్న రైలుమీద పెందుర్ని అను స్టేషనుకు 0-8-0 టికెటుతో పోవచ్చును. అక్కడదిగి గుర్రపుబండిమీద 5 మైళ్ళు పోయిన అజంటా చేరవచ్చును. ఇదిగాక మన్మాడు ఢిల్లీకి మధ్యనున్న జల్గాను స్టేషనులో దిగినయెడల అక్కడనుంచి రోడ్డుమీద మోటారు ప్రయాణము 40 మైళ్ళుచేసిన అజంటానుచేరవచ్చును. సర్వీసుమోటారు లేదు. ప్రత్యేకించి మోటారు చేసికొనవలసియుండును. అజంతాగుహాలలోగల చిత్తరువులు ప్రపంచములో నెల్లనగ్రగణ్యములని ప్రసిద్ధిగాంచినవి. అన్యదేశీయులు హిందూదేశమునకు వచ్చినయెడల ఆగ్రాను అజంతాను చూడకుండపోవువారుండరు. పూర్వకాలమునగల శిల్పచాతుర్యమును మనవారు కళలలోగాంచిన ప్రావీణ్యము నిచట చూడవచ్చును. అజంతాకు గుహాలకు 4 మైళ్లు.

**అనంతశయనము:**—దీనినే తిరువనంత పురమనియు ట్రివేండ్రమని పిలిచెదరు. ఇది యొక స్వతంత్రరాజస్థానము తిరువాన్కూరు రాజ్యమునకు ముఖ్యపట్టణము. అనంతపద్మనాభస్వామి ఆలయము గలదు. ఇచ్చట స్త్రీలకు స్వాతంత్ర్యముగలదు. వారి కట్టు జుట్టు వింతగానుండును. ఇచట లా కాలేజి గలదు. మధురనుంచి మణియాచీ జంక్షనుమీదుగా పోవు రైలుమార్గమున చెన్నపట్టణమునకు 591 మైళ్ళదూరముననున్నది. మధురకు 243 మైళ్ళదూరము. ఇచ్చట సత్రములు గలవు. ఇక్కడి జనులు వంటకములందు కొబ్బరినూనె నుపయోగించెదరు.

**ఆల్వారు:**—ఢిల్లీకి 398 మైళ్ళదూరము. ఇచ్చట హిందూదేశమునందలి పురాతన గ్రంథములను గలిగిన గొప్పగ్రంథాలయము గలదు.

**అమరావతి:**—చెన్నపురిరాజధానిలో గుంటూరు జిల్లాలో కృష్ణా రమున గలదు. రెండువేల సంవత్సరములకు బూర్వము విశ్వవిద్యాలయ

ము గలిగి హిందూదేశమున ప్రాముఖ్యముగాంచిన గొప్పపట్టణము. నేడు పల్లెగా నున్నది. ఇచ్చట బౌద్ధస్థూపములు పాశ్చాత్యుల కాశ్చర్యము కలిగించుచున్నవి. ధాన్యకటకమని ప్రఖ్యాతిగాంచిన పట్టణము అమరావతి నంటియున్నది. ఇప్పుడచ్చట అమరేశ్వరస్వామివారి ఆలయముగలదు. ఇది చూడతగియున్నది. దీపాలదిన్నె అను ప్రదేశమున భూగర్భమున జేరిన అనేక పురాతన శిల్పములు మణులు నిచ్చట గలవని ప్రతీతి. గుంటూరునకు 21 మైళ్లదూరము. గుఱ్ఱపుబండ్లు మోటారులు గలవు. బెజవాడనుండి కృష్ణలో నీరు విశేషముగ నున్నప్పుడు స్టీమరుమీద సులభముగా నిచటకు బోవచ్చును. దీనికి సమీపమున కొల్లూరులో సుప్రసిద్ధ వజ్రపు గనులు గలవు కోహినూరిచ్చటిదే.

అమరనాద్:— శ్రీనగరంనుంచి 8 మకాముల కాలి నడకను కొండలమార్గమున పోవలెను. దీనిని కైలాస గిరి యందురు.

అయోధ్య:—సుప్రసిద్ధచారిత్రక మహాపట్టణము. లక్నోకు ఆగ్నేయముగను ప్రయాగకు ఈశాన్యముగా 84 మైళ్లదూరములో నున్నది. అయోధ్య కాశీప్రయాగలు కొంచెము హెచ్చుతగ్గుగా ఒకదానినుంచి యొకటి సమానదూరములలో నున్నవి. అందుచేత కొందరు కాశీనుంచి అయోధ్యకుబోయి ప్రయాగకు చేరుదురు. మన్మాడుమార్గమున బోవువారు ముందుగా ప్రయాగచేరి అయోధ్యమీదుగా కాశీకి పోవచ్చును. హరిద్వారప్రాంతమునుంచి వచ్చువారుముందుగా అయోధ్యజూచి పిమ్మట ప్రయాగతరువాత కాశీకిరాగలరు. ఇచ్చటసరయూనదిగలదు. శ్రీరాముల వారి జన్మస్థానము. రాములవారి పట్టాభిషేకము జరిగినదనే ప్రదేశము మొదలగుచోట్ల ఆలయములు నిర్మింపబడియున్నవి. ఈప్రదేశము పట్టణములో చాల ఎత్తైన దిబ్బగానుండి కొన్నివేల సంవత్సరములనాడు శిధిలమైనటుల దెలియుగలదు. ఆంజనేయులవారి ఆలయము చూడదగినది. వసతికి సత్రములనేకముగలవు. ఎక్కడచూచిన రామమందిరములే అంతా రామమయముగానుండును. కోతులసంఖ్య మిక్కిలి హెచ్చుగానుండును. ఇచ్చట రామగంగ వసిష్టగంగ సరయూనదులు గలియును. రామఘాట్ లక్ష్మణఘాట్ కనకభవనము ముఖ్యమైనవి. సప్తమోక్ష



స్థానములలో నిదియొకటి. తీర్థవిధిగా ఎంచవలసిన స్థలము. గోగ్రానే సరయూనదియందురు. స్టేషనుకు 3 మైళ్ళదూరము. బండ్లు దొరుకును.

అలహాబాదు—ప్రయాగకు 2 మైళ్లలోనున్న మహాపట్టణము. ఇచ్చటి కోట చూడదగినది. పార్కుముఖ్యము. కోటలో పాండవుల విగ్రహములు మొదలగునవి భూగర్భభాగమున కాపాడబడియున్నవి. కోటకు దక్షిణమున సరస్వతినది గుప్తముగా ప్రవహించుచున్న గుర్తుతెలియగల నొక బావి యమునానదియొడ్డునగలదు. ఈ కోటకు తూర్పుగా త్రివేణీ సంగమస్థానము గలదు; అనగా గంగ యమునా సరస్వతీనదులు మూడు నచ్చటకలియును. ఈపట్టణములో హైకోర్టుమొదలగుగవర్నమెంటుబిల్డింగులుగలవు. మోతిలాల్ నెహ్రూ పండితుని మహాల్ చూడతగినదిగ భారద్వాజాశ్రమమునకు సమీపములోనున్నది. జనసంఖ్య లక్షున్నర. కోటలో అశోకుడు స్థాపించిన స్తంభము చూడదగినది. కుంభమేళకు లక్షలకొలది యాత్రీకులు వచ్చెదరు.

అలంపురి:—అష్టాదశశక్తులలోచేరిన జోగులాంబ ఇచ్చటగలదు. దేవాలయము పెద్దది. బెజవాడనుంచి గుంటకలకుబోవు రైలున ద్రోణాచలం వద్దనుంచి రైలు మారి కర్నూలుస్టేషనుచేరి అచ్చటనుంచి రోడ్డున 8 మైళ్ళు పోవలెను. దీనిని శ్రీశైలమునకు పశ్చిమద్వారమందురు. తుంగభద్రా నదీతీరము.

అవురంగబాద్:—సికంద్రాబాదునుంచి మన్మాడుకుబోవు రైలుమార్గమున మన్మాడుకు 71 మైళ్లు దూరమునయున్న రైలుస్టేషను. ఇచ్చటనుంచి ఎల్లోరాగుహాలకుబోవుటకు మోటారులుగలవు. మొగలాయి రాజ్యములో నొకజిల్లా ముఖ్యపట్టణము. ఊరుమధ్యనుంచి దౌలతబాద మీదుగా ఎల్లోరాకుబోవు రాచబాటగలదు. ఎల్లోరాకు 13 మైళ్ళు.

అహమ్మదాబాద్:—బొంబాయికి ఉత్తరముగానున్నది. రైలు స్టేషను. ఇచ్చటనుంచి ద్వారకకుపోవలెను. ఇక్కడ మిల్లులుగలవు నిప్పుపుల్లలయంత్రశాలగలదు. రైలు సమీపములో సత్రముగలదు ఇక్కడి పెద్దమసీదు సర్కెజుచెరువు చిత్రమగు నూతులు చూడదగినవి.

అహోబిలము:—కర్నూలు జిల్లాలో అరణ్యమధ్యమందున్న గొప్ప

దేవాలయముగలదు. నృసింహమూర్తి విగ్రహముగలదు. బెజవాడనుంచి గుంటకల్‌కుబోవు రైలుమార్గమున గాజులపల్లివద్దదిగి 24 మైళ్లబండి ప్రయాణమునకు రోడ్డుగలదు. సగముమార్గము మహాదరణ్యము. రుద్రవరమను గ్రామమునుంచి ప్రారంభమగును. వైష్ణవులకు ముఖ్యక్షేత్రము కొండచివర కొండ మధ్యకొండ దిగువను ప్రత్యేకముగ ఆలయములు గలవు. క్రింది ఆలయమున 8 అడుగుల వలయముగల స్తంభములమీద నున్న మంటపము చూడదగినది. నందియాలు స్టేషనుకు 30 మైళ్లు.

ఆగ్రా:—మన్మాడునుంచి ఢిల్లీకిబోవు రైలుమార్గమున బొంబాయికి 835 మైళ్లదూరముననున్న రైలుస్టేషను. కంటోన్మెంటుసిటీఫోర్టు అని మూడుస్టేషనులుగలవు. ఆగ్రా చూడదలచినవారు ఫోర్టుస్టేషనులో దిగవలెను. అచ్చటకు సమీపమున సత్రములుగలవు. యమునానది స్టేషనుకు సమీపము కోటనంటియుండును. కోటలో మంచిగంధపు దర్వాజా సోమనాథ దేవాలయమునకు చెందినదిగలదు. దీనిని ఘజ్నీమహమ్మదు తెచ్చి ఇచ్చట నుంచినట్లుల దేయుచున్నది. తాజ్మహాల్ మందిరము కోటకు కొంచెముదూరములో యమునఒడ్డునగలదు. తెల్లని చలవరాళ్ళతో సున్నము కలియకుండ నిర్మింపబడినది. లోపల మిక్కిలి చల్లగానుండును. ఇట్టి అందమైన మందిరము ప్రపంచములో లేదనవచ్చును. దీనిని చూచియేతీరవలెను. ఇచ్చట షాహజహాను చక్రవర్తియొక్క ఆయన భార్యయగు ముముతాజ్మయొక్క గోరీలుగలవు. ఆగ్రాను యమప్రస్థమని పూర్వమునందనెడివారు. ధర్మరాజు కృష్ణరాయభారములో అయిదూళ్లు దహరించిన వానిలో నిదియొకటి. జనసంఖ్య లక్షడెబ్బైఅయిదువేలు రాజకిషనులాలా ధర్మశాలకోట స్టేషనువద్దగలదు.

ఉడిపి:—మాధ్వులకు ముఖ్యయాత్రాస్థలము పశ్చిమ సముద్రతీరమున మంగుళూరు రైలుస్టేషనువద్దదిగి మోటారుమీద 33 మైళ్ళ ప్రయాణముచేసిన ఉడిపికి చేరగలము. సముద్రము బస్తీకి అరమైలు దూరము. సత్రములుగలవు. మధ్వాచార్యులవారి మఠముగలదు. కృష్ణాలయము శివాలయము ముఖ్యమైన ఆలయములు ఇచ్చటకు 40 మైళ్ళ దూరమున సుబ్రహ్మణ్యక్షేత్రముగలదు.



ఉదకమండలం:—దీనిని ఊటీఅందురు చెన్నపురి. గవర్నమెంటువారు వేసవిలో చల్లదనమునకై యిచ్చటనుందురు. కొండలకుమధ్య యీ ప్రదేశముచూడదగినది. విద్యాధికులు పెక్కండ్రు వేసవి నిచ్చట గడిపెదరు. పోదనూరునుంచి రైలుమార్గము కొండలమీదుగా గలదు. మైసూరునుంచి మోటారుమీద చేరవచ్చును. సముద్రము మట్టముకంటె 7210 అడుగుల ఎత్తున నున్నది.

ఓంకారము :— కాండ్వానుంచి ఉజ్జయినికిబోవు రైలుమార్గమున మోరుటక్కా రైలుస్టేషనునకు 7 మైళ్లు. ఓంకారేశ్వరుని ఆలయముగలదు నర్మదాతీరము. స్టేషనునుంచి రెండుమైళ్లు దాటినతర్వాత అరణ్యముగలదు. కొండముచ్చులుగలవు. నర్మదానదిలో చేపలు హెచ్చుగానుండును. కాశీలో వలె అభిషేకం స్వయముగా చేయవచ్చును. అమరేశ్వరం అని పిలిచెదరు. సనవాడు స్టేషనుదగ్గిర రైలుదిగిపోవచ్చును. మాంధాతలంకలో ఓంకారమున్నది ఇచ్చట నర్మదాస్నానము ముఖ్యముగా నెంచబడుచున్నది. యాత్రికులు శ్రావణమాస మంతయు నిచ్చటనుండుటగలదు.

ఉజ్జయిని:—(అవంతిక)మన్మాడునుంచి ఢిల్లీకిబోవు రైలుమార్గమున కాండ్వాస్టేషనువద్దదిగి మరియొక రైలుమీద ఫతేబాదు మార్గమున ఉజ్జయినిచేరవలెను. పూర్వపు మాల్వా రాజ్యమునకు ముఖ్యపట్టణము. మహాకాళి ఆలయముగలదు. కాళిదాసు మహాకవి కిచ్చటనే విద్యాస్థానమని వదంతిగలదు. దీనినే అవంతికఅందురు. తీర్థవిధికి ముఖ్యప్రదేశము సప్తమోక్షస్థానములలోనిదియొకటి. ఈమహాకాళి అష్టాదశశక్తులలోచేరినదైయున్నది. "అయోధ్యా మధురామాయా కాశీకాంచి అవంతి కాపురీ ద్వారావతీచైవా సప్తయితా మోక్షదాయకాః" ఇక్కడనదిపేరు సిప్రా హిందూదేశమునకు మధ్యస్థానముగ దీనిమీది దక్షిణోత్తరరేఖనుంచి తూర్పు పడమరలు దూరమునునిర్ణయించి పంచాంగములను చిరకాలము నుంచి వ్రాయుచున్నారు. బస్తీకి దక్షిణమున నక్షత్ర పరిశోధకశాల గలదు.

ఎలిఫాంటా:—బొంబాయినుంచి సముద్రముమీద బోటులో

7 మైళ్లు వెళ్ళిన ఎలిఫాంటా గుహాలుగలవు. చాలపెద్దవి. ఒక్కరాతితో తొలచబడినవి. ఇందుకొన్ని విగ్రహములు చూడదగియున్నవి. అర్ధనారీశ్వరుని విగ్రహము ముఖ్యమైనది.

ఎల్లోరా:— ఔరంగబాద స్టేషను అనగా శికిందరాబాదు మన్మాడు రైలుమార్గముమీదనున్న దానివద్దదిగి మోటారుమీద ఔరంగబాద దౌలతబాదాలగుండా మంచిరోడ్డుమీద 13 మైళ్ళదూరమున ఎల్లోరాగుహాలు చూడగలము. ఇందు మొదటిది కైలాసఆలయము చూచితీరవలెను. ఇట్టి అద్భుతమైన ఒక్కరాతిలో చెక్కబడిన పెద్ద దేవాలయము నెచ్చటచూడము. ఇట్టి వచ్చట మరికొన్నిగలవు. ఎల్లోరా రోడుస్టేషనువద్ద దిగునెడల బండ్లుదొరకవు. గుహాలవద్ద వసతికేర్పాటు లేదు. వెంటనే స్టేషనుకురావచ్చును. ఎల్లోరాలోనికైలాసాలయము 247 అడుగులపొడుగు 150 అడుగుల వెడల్పు 100 అడుగుల ఎత్తుగలిగి ఒక్కరాతినుంచి ఏర్పడినది. ఇక్కడి ధ్వజస్తంభము 45 అడుగులఎత్తు.

కంచి:— కంజీవరము అను రైలుస్టేషను ఆర్కోణమునకు చెంగల్పట్టుకు మధ్యఉన్నది. చెంగల్పట్టునుంచిగాని ఆర్కోణమునుంచిగాని రైలుమీద పోవచ్చును. స్టేషనుకు శివకంచి 2 మైళ్ళదూరముననున్నది. స్టేషనువద్ద బండ్లు దొరుకును. శివకంచిలో ఏకాంబ్రేశ్వరుని గుడికలదు. ఇచ్చట కోనేటిలో స్నానము చేయుదురు. కంచినగరమున నీటికుళాయిలు గలవు. శివకంచికి విష్ణుకంచికి మూడుమైళ్ళ దూరముకలదు. విష్ణుకంచిలో శ్రీవరదరాజస్వామివారి ఆలయము కలదు. ఇక్కడి దేవాలయ ప్రాకారములను ఆవరణ విశాలముగా నుండును. శివకంచిలో నితరదేవాలయములు చాల గలవు. కంచిలో గరుడసేవకు జనులు విశేషముగా చేరుదురు. ఇచ్చటి గోపురములు మిక్కిలి పెద్దవి. 188 అడుగులు ఎత్తు. మోక్షదాయక మని హిందువులు దలంచు సప్తక్షేత్రములలో కంచి యొకటి. అష్టాదశశక్తులలో నొకరగు కామాక్షీదేవి కిచ్చట ప్రసిద్ధాలయము గలదు. కంచిలో పంచలింగములలో నొకటగు పృథివీలింగము గలదు. శివకంచిలోని యాలయమందలి మామిడిచెట్టు కొన్నివందల సంవత్సరముల నాటిదని చెప్పుదురు. దానిపండ్లు భక్తులుశ్రద్ధతో గైకొందురు. శ్రీశంకరులవారి విగ్రహమిచ్చట కామాక్షీదేవాలయమునందు గలదు. అప్పయ్యదీక్షితులవారి నివాసస్థలమని ప్రసిద్ధి. కామకోటి పీఠస్థానము. ఇచ్చట గంగాభాయి సత్రము, నాటకోటిసత్రము. మున్యాంవారి సత్రము, వాళిరెడ్డివారి సత్రము మొదలగు సత్రములు గలవు. బస్తీకి వెలుపల సర్వతీర్థమను కోనేరు గలదు. యాత్రికు లక్కడ ముందుగా స్నానము జేసి గుడికి పోయెదరు.



కలకత్తా:— హౌరాస్టేషనులో రైలుదిగి అచ్చట హుగ్లీనదిమీద వంతెన దాటి బస్తీలోనికి పోవలెను. హారిసను వీధిపెద్దది. మేడలు నాలుగైదు అంతస్థులవి విశేషముగ గలవు. హిందూదేశమునకు ముఖ్యనగరము. జనసంఖ్య 11 లక్షలు. గంగానది యిచ్చటనుంచి 80 మైళ్ళలో సముద్రములో గలియుచోటు. వీధులందు ట్రాంబండ్లు, మోటారులు విశేషముగా జూడ గలము. ఇచ్చట కాళీ ఆలయమును విక్టోరియా మెమోరియల్ పార్కు మ్యూజియములు సర్కారుతోటలు చీకటికొట్టు మొదలగునవి చూడదగినవి. గవర్నరు కచ్చేరీలు వసతి గృహములు హైకోర్టును గలవు. పెద్దషాపు లనేకములు గలవు. సత్రము లక్కడక్కడ 4, 5, అంతస్థుల మేడలలోగలవు. ఈసత్రములలో వంటపై అంతస్థుమీద చేసికొనవలెను. కొన్ని సత్రములలో దిగువ నాలయములును గలవు. అట్టి వానిలో ఆగరువాలాసత్రము హారిసను రోడ్డున గలదు. అందు రాజరాజేశ్వరీ ఆలయము గలదు. కిడ్డరుపూరుభాగములో నాంధ్రులు విశేషముగా గలరు. చెన్నపురికి 1032 మైళ్లు.

కన్యాకుమారి:— దక్షిణ సముద్ర తీరమున నున్నది. ఇచ్చట ఆలయము సముద్రపు టలలకు నంటియున్నది. కన్యాకుమారీ అమ్మవారిని చూచుటకై శుక్రవారమున యాత్రికులు విశేషముగా వచ్చెదరు. మధురనుంచి ట్రివేండ్రింబోవు రైలు మార్గమున తెంకాశీస్టేషనులో దిగి తోత్యాద్రిమీదుగ నిచ్చటకు బోవలెను. అమ్మవారిచేతిలో శ్రీజనార్దనస్వామి మెడలో వేయుటకై హారమును పట్టుకొనినటుల నుండును.

కాంపూరు:— లక్నోనుంచి కాన్పూరుకు రైలుమార్గముగలదు. కాన్పూరునుంచి ప్రయాగకును రైలుమార్గము కలదు. ఇచ్చట వీధులు

విశాలముగా నుండును. దీనిని వాల్మీకిమహర్షి యాశ్రమ ప్రదేశముగ హిందువులు భావించుచున్నారు. జనసంఖ్య 2 లక్షలు. తులసీరాము సత్రము స్టేషనకు 2 ఫర్లాంగులలో నున్నది. ఇక్కడ చాల ఫ్యాక్టరీలు గలవు. పాతపట్టణమునకు క్రొత్తకాన్పూరుకు 3 మైళ్లు.

కోటిఫలి:— చెన్నపురినుంచి విశాఖపట్టణంకుబోవు రైలుమీద ద్వారపూడివద్ద దిగి ద్రాక్షారామము మీదుగా బండ్లు, మోటారులలో ప్రయాణము చేయవలెను. దాక్షారామమునకు 6 మైళ్ళు. ఇచ్చట గోదావరి గలదు. మిక్కిలి పెద్ద చెరువు సత్రము కలవు. ఇచ్చటిఆలయమునకు విజయనగరము మహారాజాగారు ట్రస్టీ. గోదావరికి అవతల మైలులో ముక్తేశ్వరక్షేత్రము గలదు. కాకినాడనుంచి రైలువేయబడు చున్నది. ఇక్కడికి సమీపమున విఘ్నేశ్వరుని ఆలయము మిక్కిలి పెద్దది గలదు. కాకినాడనుంచికూడ యాత్రికులు విశేషముగా నచ్చటికి బోయెదరు.

కాలటీ:— శ్రీశంకరాస్వాములవారి జన్మస్థానము. పోదనూరు జంక్షనునుంచి కాళ్ళికటుకుబోవు రైలుమార్గమున షోరనూరునుంచి కొచ్చినుకుబోవు రయిలుమార్గము సమీపమున కలదు. షోరనూరు సమీపములో కాలటీగ్రామము గలదు. దానినంటి పూర్ణానది ప్రవహించును. అనేకమంది ప్రతిసంవత్సరమును ఇటీవల జరిగిన అచ్చటి ప్రతిష్ఠలను చూచుటకై పోవుచుందురు. ఇచ్చట శంకరాలయము గలదు.

కాశీ:— దీనినే వారణాసిఅందురు. వరుణ అసినదులు ఇచ్చట గంగలో కలియును. ఆమధ్యప్రదేశమును వారణాసి యందురు. ఇచ్చట శ్రీవిశ్వేశ్వరునిదేవాలయమును శ్రీఅన్నపూర్ణదేవాలయమును ప్రతిదినము వేలకొలది యాత్రికులు దర్శించుచుందురు. అనేక దేశముల నుంచి జనులు కాశీలో నివాసముగా నున్నవారు గలరు. గంగలో ననేక ఘట్టములుగా నేర్పాటుకాబడి మెట్లుగలిగి వేసవిలో స్నానముచేయుచోటు నకు గట్టునకు రెండు తాళ్ల వ్యత్యాసముండును. గంగలో చిన్నపడవలనేకము లుండును. ఘట్టములలో ప్రథమము మణికర్ణికాఘట్టము. ఇచ్చట స్నానముచేసి గాని విశ్వేశ్వరుని జనులుసందర్శింపరు. బస్తీకి వెలుపల 2 మైళ్ళదూరమున విశ్వవిద్యాలయము గలదు. ఇది చూడదగియున్నది. కాశీకివెళ్ళిన యాత్రీకులు విశ్వేశ్వరుని చూచిన వారముదినముల లోకాడీబాయి ఆలయమును విధిగా చూచెదరు. అచ్చట మూలపల్లి నంటి చిన్నగుడికలను. అందుయాత్రికులు కొన్నిగవ్వలను లెక్కపెట్టి వేయుదురు. కేదారఘట్టము చాలప్రసిద్ధి గాంచినది. ఇచ్చట కేదారేశ్వరుని ఆలయము గలదు. అసి వరుణ సంగమస్థలములందు ముఖ్యముగా యాత్రికులు స్నానము చేయుదురు. పంచగంగలనగా దంతపావ, జార్నంద, కిర్నంది, సరస్వతీ, గంగ కలియుచోటు పంచగంగాక్షేత్రము. పిశాచ మోచనము అగస్త్యకుండముల జలముల స్నానముచేయుదురు.

కలకత్తాకు 476 మైళ్ళు. బొంబాయినుంచి 938 మైళ్ళు. చెన్నపట్టణమునుంచి 1550 మైళ్ళు. కాశీకి నుత్తరమున మూడున్నర మైళ్ళదూరమున సారానాద్ అను బౌద్ధులకు ముఖ్యస్థానము గలదు. బుద్ధుడిచ్చట నుండెను. హిందూదేశమున ప్రఖ్యాతిగాంచిన రాజకీయ సంస్కృత కళాశాల సరస్వతీ భవనము చూడదగినవి. నెల్లూరుజిల్లాకు చెందిన దక్షిణామూర్తి ఆశ్రమస్వాములవారు కేదారఘట్ట ప్రాంతమున గలరు. మన ఆంధ్రయతులలో కాశీలోనున్న వారిలో వీరును శ్రీ బ్రహ్మానందస్వామి వారును ముఖ్యులు. వీరిరువురు యాత్రీకుల సౌకర్యములను కనుగొనుచుందురు. మొగల్‌శరాయి స్టేషనునుంచి కాశీస్టేషనుకు 7 మైళ్లు. జ్ఞానకూపి అమృత కుండం నాగకుండం అనే నూతుల జలమును యాత్రీకులకు ముఖ్యము.

కేదారఘట్టం సమీపమున హరిశ్చంద్ర ఘట్టముగలదు. ఇదియొక స్మశానవాటిక. మణికర్ణికవద్ద నొక స్మశానవాటికగలదు. రాత్రింబవళ్ళు అనేక శవములీచోట్ల దహనమగుచుండును. ఎచ్చటచూచినను లింగము లపరిమితముగా గన్పడును. గంగలో స్నానముచేసి యాత్రీకులుదారిలో లింగములపై జలమునుంచుచు విశ్వేశ్వరాన్నపూర్ణలను సందర్శించుటకు ప్రాతఃకాలమున వేలకొలది బోయెదరు. విశ్వేశ్వరుని గుడి చిన్నది. చాతుర్వర్ణములవారును లింగమునంటి అభిషేకము చేయుటకు వీలుగలదు. పంచక్రోశయాత్ర అనగా విశ్వేశ్వరాలయమున కెటుచూచినను పంచక్రోశదూరమున వరుసగా ననేక పుణ్యస్థలములు ఆలయములు గలవు.

ఆంధ్రులు విశేషముగా నారదఘట్టముహరిశ్చంద్రఘట్టముల మధ్య ప్రదేశమందుండు పాండాలగృహములలో బసచేయుదురు. తులసీగణేశ జోషీ గారు వీరి కొమారులు.జానకిరామ జోషీ గారు వీరి బావమరిది విశ్వనాథ శాస్త్రిగారు చల్లా సుబ్బారావుగారు ద్వారక భమిడిపాటి లక్ష్మీనారాయణశాస్త్రిగారు మొదలగువారాంధ్రులకు వసతులనేర్పాటు చేయువారిలో ప్రముఖులు. బెజవాడ వాస్తవ్యులగు బ్రహ్మానందస్వామివారు బిందుమాధవఘట్టమున పంచ గంగేశ్వరమఠము నేర్పాటు చేసియున్నారు. క్షేమేశ్వరఘట్టములో శంకరమఠము గలదు. మాధ్వులు హనుమాను ఘట్టమునబసచేయుదురు. కాశీలో బెంగాలీలు హెచ్చుగానుందురు. కాశీనుండి బయలుదేరకపూర్వము కాలభైరవాలయమును చూచి యాత్రికులు బయలుదేరెదరు. ప్రతిదినము డుంఠివినాయకుని దండపాణి మొదలగుదేవుళ్ళ చిన్నగుడులను నిత్యయాత్రగా యాత్రికులు సేవించుచుందురు. ఇచ్చట పట్టు పరిశ్రమ హెచ్చు. ఇక్కడి గోవులను చూచితీరవలెను. సందులు బహుసన్నముగానుండి రెండువైపుల మేడలుండుటచేత మైళ్లకొలది కాశీలో మధ్యాహ్నమైనను సూర్యరస్మి తగలకుండ పోగల సందులనేకములు గలవు. కాశీఅని చిన్నస్టేషను గలదు. బెనారసు అనే మొగల్‌శరాయి పెద్దస్టేషనుగలదు. స్టేషనునుంచి గంగసమీపమునకు 2, 3 మైళ్ళుండును. నాటుకోటిశెట్ల సత్రము అన్నపూర్ణసత్రము మొదలగునవి గలవు. ఇవి అన్నసత్రములు. ఇచ్చటనుండు సాధులకు సన్యాసులకుమితము లేదు. దక్షిణముగ గంగ కావలిగట్టున వ్యాసకాశీ గలదు, ఇచ్చట కాశీరాజాగారి మహల్ చూడదగియున్నది. అగస్త్యాశ్రమము మొదలగునవెన్నియో చూడవలసినవి గలవు. కాశీలో మరణము ముక్తినిగలిగించునని హిందువులు నమ్ముటగలదు. సప్తమోక్ష ప్రదేశములలో కాశీయొకటి. కాశీలో సందర్శింపబడు నిత్యయాత్రా విధానములో "విశ్వేశం మాధవం ఢుండిం దండపాణించ భైరవం వందేకాశీం గుహాం గంగాం భవానీం మణికర్ణికాం" యని యాత్రికులా స్థలములను గురించి స్మరించుచుందురు. అష్టాదశ శక్తులలో విశాలాక్షి దేవాలయమిచ్చట గలదు. దశాశ్వమేధఘట్టము పంచగంగాయాత్రలో జేరినదైయున్నది. వ్యాసకాశీకి రెండుమైళ్ళ



దూరమున పురాణవ్యాసక్షేత్రము గలదు. పంచక్రోశయాత్రకైదు మజిలీలు గలవు. మొదటి మజిలీకర్దమేశ్వరం 6 మైళ్ళు. అక్కడనుంచి రెండవ మజిలీ భీమచండీ 8 మైళ్ళు దారిలో పంచపాండవుల విగ్రహములు చూడదగినవి. మూడవమజిలీ రామేశ్వరునిగుడి 10 మైళ్ళు. నాల్గవమజిలీ కపిలధార 13 మైళ్ళు. అయిదవమజిలీ 6 మైళ్ళు.పంచక్రోశయాత్ర మొత్తము 43 మైళ్ళు. కాశీకి చుట్టు ప్రదక్షిణము చేయుదురు. బెసెంటమ్మకళాశాల చూడదగియున్నది. విజయనగరం మహారాజాగారిభవనము బౌనుహాల్ ఆంధ్రుల నాకర్షించును. జనసంఖ్య 2 లక్షలు.

కాశ్మీరము (శ్రీనగరము):—మిక్కిలి చలి ప్రదేశము. హిమాచల పర్వతములలోనున్నది. శ్రీనగరు కాశ్మీర రాష్ట్రమునకు ముఖ్యపట్టణము. ఇది స్వతంత్రమహారాజుయొక్క పరిపాలనములోనున్నది. చూచుటకు మిక్కిలి మనోహరముగనుండును. శ్రీ శంకరాచార్యులవారిచే నేర్పాటుగాబడిన నాలుగు సుప్రసిద్ధమఠములలో నొకటి యిచ్చట గలదు. ఇది శారదాపీఠము. ఇక్కడ జీలమునదిగలదు. ఇక్కడ లాల్లారూకు చెరువు నందలి నీటిపైన తేలియుండు తోటలు చూడదగినవి. శంకరాలయము ముఖ్యమైనది. ఇక్కడనుంచి ఈశాన్యముగా కైలాసగిరికిమార్గముకలదు. అక్కడ సింధూనది సట్లెజునది ప్రారంభమగును. అక్కడనుంచి మానసరోవరమునకు మార్గముగలదు. లాహోరునుంచి జమ్మువరకు 231 మైళ్లు రైలుగలదు. అక్కడనుంచి 133 మైళ్లు రోడ్డున బోవలెను.

కాళహస్తి:—దీనిని శ్రీ కాళహస్తి అందురు.తిరుపతినుంచిగూడూరునకుపోవురైలుమార్గమునగలదుఇచ్చటసువర్ణముఖినదిగలదు. ఆలయము కంచిలోని ఆలయమువలె మిక్కిలిపెద్దది. కొండమీద నొక దేవాలయము గలదు జమీందారీపట్టణము. పానగల్ రాజాగారి నివాసస్థలము. ఇచ్చట నాటుకోటిశెట్లఅన్నసత్రముగలదు. వసతికితరసత్రములుగలవు. స్టేషనునుంచి మైలున్నర దూరముండును. కంచు పోతబోయు ఫ్యాక్టరీలుగలవు. శ్రీకాళహస్తీశ్వరలింగము పంచలింగములలో జేరిన వాయులింగము. గర్భగుడిలో గాలివచ్చు ప్రదేశము కనబడదు. అచ్చటి దీపములు గాలికి కదలుచుండును. శివరాత్రికి యాత్రికులు విశేషముగా వచ్చెదరు.

గోకర్ణము:—పశ్చిమ సముద్రతీరమున ఉత్తర కనరా జిల్లాలో కలదు. హుబ్లిస్టేషనునుంచి రోడ్డుమీద 128 మైళ్ల ప్రయాణము. బండ్లుగలవు. దారి 30 మైళ్ళు దాటినతరువాత అరణ్యమధ్యమునగలదు. బాట వంకర టింకరగా నుండును. ఇచ్చటి దేవునిపేరు మహాబలేశ్వరుడు. అంగుష్టప్రమాణమునయుండును. ఇక్కడ పాండాలు చాలమంది గలరు. ఆలయము పెద్దది. కోటి తీర్థమను కోనేరుగలదు. అమ్మవారిపేరు తామరగౌరీచేతిలో త్రాసును తూచుచున్నటుల గన్పడును. ఇక్కడిలింగము శివుడు రావణుని కిచ్చిన లింగములో భాగమని వాడుక. మార్మగోవానుంచిగాని, హావేరి స్టేషనునుంచిగాని కూడా ఇక్కడికి పోవచ్చును.

కుంభకోణము:—చెన్నపట్టణమునుంచి రామేశ్వరమునకు బోవు రైలుమార్గముననున్నది. కావేరి ప్రక్కననే ప్రవహించును. రైలుకు సమీపముననే సత్రములుగలవు. ఈసత్రములలో దొంగల హడావుడిహెచ్చు. ఇచ్చటి జనులను వేయికన్నులతో కనిపెట్టియుండవలెను. కుంభేశ్వరుని దేవాలయమును సారంగపాణి దేవాలయమును ముఖ్యమైనవి. ఇక్కడ కంచుపాత్రలు విశేషముగా గలవు. ఇక్కడ పెద్ద కాలేజీగలదు. మహామగము కోనేరు ముఖ్యమైనది. 12 సంవత్సరములకు ఒకసారి మహామాఘోత్సవమునకు వేలకొలది యాత్రికులిచ్చటకు వచ్చెదరు.

కురుక్షేత్రము:—ఢిల్లీనుంచి లాహోరుకుబోవు రైలుమార్గమున గలదు. స్టేషనుకు సమీపములో సత్రముగలదు. థానేశ్వరమను పురాతన పట్టణము 2 మైళ్ళలో గలదు. పెద్దబయలుగలదు. ఇదియే భారత రణరంగము. ఒకచోట గీతాభవనముగలదు. ఇచ్చటనే శ్రీకృష్ణుడర్జునునకు గీతల నుపదేశించిన స్థలముగ కనపరచెదరు. పాన్‌గంగయని చిన్న తటాకముగలదు. అర్జునుడు బాణమువేసి నీరుతీసిన చోటందురు. ఇచ్చటి మట్టిలో కంచుపదార్థములున్నవి. మట్టిబొమ్మలను నేలపైవేసిన కంచు మ్రోగినటుల మ్రోగును. తీర్థములని కొన్ని తటాకములుగలవు. వానిలో స్నానముచేసి అచ్చట దేవాలయములలోని పాండవాది భీష్మాది విగ్రహములను జూచెదరు. కర్మిష్టుల కీప్రదేశము చాలముఖ్యము. శమంతక పంచకము భీష్ముని అంపశయ్య మొదలగు ప్రదేశములు చూడదగినవి.



అష్టాదశశక్తులలో జేరిన మహామ్మాయీశక్తికిది నిలయము. పానుగంగకు బోవుమార్గముననే థానేశ్వరమను పట్టణముగలదు.

కొల్లాపురం:—శక్తిఆలయము గలదు. మహాలక్ష్మియందురు. స్వతంత్రరాజుగలడు. పశ్చిమ సముద్ర తీరసమీపమున గలదు. పూనానుంచి బెల్గాంమునకు బోవురైలుమార్గములో మీరజువద్దనుంచి వేరురైలునపోవలెను. ఈశక్తి అష్టాదశశక్తులలో చేరినది. కొండపైని కేదారలింగముగలదు. ఇక్కడిచెరువులు రాజభవనము చూడదగినవి.

కొండపల్లి:—బెజవాడకు 11 మైళ్ళలో రైలుస్టేషను. ఇచ్చటి కొండమీద పూర్వపు రెడ్లప్రభుత్వమునాటికోట ఖిల్లాగలదు కోటప్రాకారములు దౌలతాబాదులోవలె ప్రశస్తమైనవి. ఈకొండ చూడదగిన చారిత్రకప్రదేశము.

కోటప్పకొండ:—గుంటూరుజిల్లాలో నర్సారావుపేట రైలుస్టేషనుకు 6 మైళ్ళదూరమున నున్నది. యల్లమంద ఇచ్చటదేవునిపేరు. శివరాత్రికి కొన్నిలక్షల జనము యాత్రకై ప్రభలతో వచ్చి కొండకు ప్రదక్షిణము చేయుదురు. యాత్రికులిచ్చు కానుకలు నర్సారావుపేటజమీందారుగారు వసూలుచేయుదురు. రాజాగారే గుడికి ట్రస్టీ. అదివారి స్వంత దేవాలయమని వారనుచున్నారు. నర్సారావుపేటకు సంతమాగులూరు స్టేషనుకు మధ్య మెనుమాకవద్ద చిన్నస్టేషను ఏర్పరిచినారు. అక్కడికికొండ 4 మైళ్ళు.

కొండవీడు:- బెజవాడనుంచి వినుకొండపోవురైలున ఫిరంగిపురం స్టేషనువద్దదిగి 1 మైలులో కొండనెక్కవచ్చును. ఇచ్చటపూర్వము రెడ్లు ప్రభుత్వము చేసినకోటగలదు. శిథిలమైయున్నది. ఇది ముఖ్యముగా చూడదగిన చారిత్రక ప్రదేశము. ఇచ్చటి శత్రుమారక సాధనమగు నూతిని చూచితీరవలెను.

కేదారము:—ఋషీకేశమునుండి నాటుమార్గమున హిమవత్పర్వతములమీద నొకప్రక్కకొండ నొకప్రక్కగంగ గల చిన్నమార్గమున బదరీనారాయణమునకు బోవు మార్గమున బోవలెను. ఋషీకేశమునుంచి 15 దినముల ప్రయాణము. 150 మైళ్ళదూరము. ఇచ్చటనుంచి బదరీ

నారాయణమునకు సాధారణముగా యాత్రికులు పోయెదరు. ఇచ్చట నేలమీద మంచుగడ్డ ముక్కలు కాళ్ళక్రిందచల్లగా గులకరాళ్లవలె నుండును. అప్పుడే మంచుకరుగుచున్నగురుతులు కనబడును. మ్యాపులో గనపరచిన రుద్రప్రయాగవద్ద మందాకినీ అలకనంద నదులుకలియును. అచ్చటనుంచి మందాకినీ ఒడ్డున 50 మైళ్ళువెళ్ళిన గుప్తకాశీ గలదు. దీనికి 20 మైళ్ళలో కేదారమున్నది కేదారమునకు దిగువను ఉక్కీమఠము గలదు. కేదారమునందలి పూజారులు మంచు ప్రారంభము కాగానే యీ మఠమునకు చేరుదురు. అప్పుడు కేదారాలయము మంచుగడ్డతో గప్పబడియుండును. తిరిగి వేసవిలో మే నెలలో మంచుకరగుటకు ప్రారంభించగానే అర్చకులు గుడికి పోవుదురు. యాత్రికులు ఉక్కీమఠం మీదుగా లాల్ సాంగావద్దకువచ్చి అచ్చటనుంచి విష్ణుప్రయాగమీదుగా బదరీ నారాయణమును చేరవచ్చును. సాధారణముగా యాత్రికులు కేదారము వెళ్ళి బదరీనుంచి రాంనగరుకు వచ్చెదరు. కేదారమునందలి యీశ్వరలింగము ద్వాదశ లింగములలోనిది. మంచుగడ్డను విడతీసి అర్చకులు తలుపులు తెరచునప్పు డచ్చటి లింగముమీది పుష్పములు నిన్నమొన్న నుంచబడినవిగ వాడక మంచిస్థితిలోనుండుట చూడదగినది. హిమాలయపర్వతములలోని కేదారనాథ పర్వతశిఖరము సముద్ర మట్టముకంటె 22800 అడుగుల యెత్తున నున్నది. ఈపర్వతము మధ్యలో కేదారేశ్వరుని ఆలయము గలదు.

ఈమార్గములోచివర 50మైళ్ళు రెండెడ్లబండ్లుచిక్కును. హరిద్వారమునుంచిలక్నోకు వెళ్ళెడి రైలుమార్గములో రాంనగర స్టేషనునుంచి వచ్చె రైలుమార్గము బారిలీస్టేషనువద్ద కలియును. మంచుప్రారంభించగానె బదరీఅర్చకులు 20 మైళ్ళలోనున్న జ్యోతిర్మఠము చేరగలరు.

**గంగోద్రి:**—హిమాలయ పర్వతములలో గంగయొక్క ప్రారంభస్థానమందురు. హరిద్వారమునుంచినడచిపోవలసిన కొండలపైనకాలిబాటగలదు. బాట గజమువెడల్పుగలిగి ఒకవైపున హిమాలయ పర్వతములు రెండవవైపున అగాధమగు గంగాప్రవాహమునుచూడదగియుండును. మిక్కిలి చల్లనిప్రదేశము కంబళ్ళు శాలువలునుండినగాని యిచ్చట



కు జనులు పోజాలరు. సంవత్సరమునకు 9 మాసము లీప్రాంతములు మంచుగడ్డతో కప్పబడియుండును. మేనెల ప్రారంభములో మంచుకరిగి గంగాప్రవాహము ప్రారంభమగును. మ్యాపులో గనపరచినప్రకారము దేవప్రయాగ అను ఊరువద్ద గంగోద్రికి మార్గముచీలి అచ్చటనుంచి హిమోద్రికిపోవలెను. మార్గములో అచ్చటచ్చట దుకాణములుగలవు. కావలసిన గోధుమపిండి బియ్యము మొదలైనవి చిక్కును. కూరగలు ఒకటిరెండుచోట్లతప్ప సాధారణముగాదొరకవు. ధరలు చాలహెచ్చుగానుండును గంగపుట్టుచోటున కెనిమిదిమైళ్ళలో గంగభాగీరథీ విగ్రహములు గలవు. ఇక్కడ ఇండ్లులేవు, ఒకచెంబునీరుతీసుకొని యాత్రికులు తిరిగివచ్చెదరు.

**గయ**—కాశీనుంచి కలకత్తాకుపోవు రైలుమార్గమునగలదు. ఇది చాలపెద్దపట్టణము. ఇచ్చట కొన్ని వేలమంది పాండాలుగలరు. బస్తీనంటి ఫల్గుణీనదిగలదు. వేసవిలోనిందుస్నానమునకు తగిననీరుండదు. నదిఒడ్డున విష్ణుగుడిగలదు. తీర్థయాత్రపరులిచ్చట పితృదేవతలను తరింపచేయుటకు గయాశ్రాద్ధముపెట్టి విష్ణుపాదము గనబడుచోట నాలయములో పిండములువేయుదురు. అటులనే వటవృక్షములక్రిందను పిండములు వేయుదురు. ఇట్టి స్థలము లష్టగయలని గలవు. వటవృక్షమువద్ద గయావర్జితములని పాండాలకు పితృదేవతలను తరించుటకై ధర్మముచేయుచు మనకిష్టమైన పదార్థములను వర్జించుటగలదు. ఇక్కడిపాండాలవల్ల బాధహెచ్చు ఇది పూర్వము జరాసంధుడేలిన చోటందురు. రాక్షసచిహ్నము లిచ్చట గాంచగలము. అష్టాదశశక్తులలో మంగళగౌరికాశక్తిఇచ్చటగలదు. గయపిండములకును కాశీభండనమునకుప్రయాగముండనమునకు ప్రఖ్యాతిగాంచినవి. సాధారణముగ యాత్రికులు పాండాల యిండ్లలో బసచేయుదురు. స్టేషనుసమీపమున పాప్రసాధు సత్రముగలదు. అదినదికిదూరము.

గోకుల:—ఆగ్రానుంచి డిల్లీకిపోవు రైలుమార్గమున మట్రా అనబడు మధురస్టేషనులో దిగవలెను. ఆచ్చటనుంచి గుర్రపుబండిమీద 7 మైళ్ళప్రయాణములో గోకులగలదు. శ్రీకృష్ణుడు బాల్యమున పెరిగిన స్థలమిచ్చటచూడవచ్చును. ఈప్రదేశము మిక్కిలి ఎత్తైనదిబ్బమీదనుండి

కొన్ని వేలసంవత్సరములకు పూర్వమున మంచి స్థితిలోనుండి యుండునను సూచనలుగన్పించును. కృష్ణుడు చెప్పిన రాక్షసులవివరములు మొదలగు కృష్ణుని బాల్యచేష్టలుగన్పరుచు విగ్రహములనుంచి ఆస్థలములందే పూర్వ మట్టిపనులు జరిగినటుల చెప్పెదరు. ఇచ్చట ఆవులమంద లనేకములును విశాలమైన పచ్చికబయళ్ళును గలవు.

గోలకొండ:— హైదరబాదు నవాబుపూర్వముండినచోటు. అక్కన్న మాదన్నలు మంత్రులుగానుండిన కాలమున భద్రాచలరామదాసుగారగు కంచర్లగోపన్నగారిని ఖైదులోనుంచిన స్థలము. ఈకొండదిగువను చారుమినార్ వంటి గొప్పకట్టడముగలదు. కొండచివర పెద్ద ఫిరంగులుగలవు. సర్కారు ఉత్తరువులేనిదీనినిచూడనివ్వరు. ఉత్తర్వు పొందవచ్చును. హైదరాబాదుకు 6 మైళ్ళలోనున్నది.

చిదంబరం:— చెన్నపట్టణము నుంచి రామేశ్వరమునకు బోవు రైలుమార్గమున గలదు. ఇచ్చట పంచలింగములలో నాకాశలింగముగలదు. అనగా శూన్యమని అర్థము దీని నేచిదంబరరహస్యమందురు. అదిగో చూడుమని హారతి వెలిగించి గుడిలో నొకభాగము నర్చకులుజూపెదరు. ఇచ్చటి పూజావిధానము మిక్కిలి చక్కగానుండును. ఆలయము మిక్కిలి పెద్దది ఇక్కడ పెద్దకాలేజికలదు. గుడి పైభాగము బంగారపురేకులతో గప్పబడి యున్నది. ఈ ఆలయములోగల గణేశ్వరుని విగ్రహమంత పెద్దవిగ్రహము హిందూదేశములోలేదు. ఇక్కడికి సమీపములో మన్నారుగుడి వృద్ధాచలం క్షేత్రములుగలవు.

చెన్నపట్టణము:— చెన్నపురి రాజధానికి ముఖ్యనగరము. కలకత్తా బొంబాయి మొదలగు రేవు పట్టణములనుంచి స్టీమరులమీదకూడ నిచ్చటకు రావచ్చును. బెజవాడవైపునుంచి బొంబాయి బెంగుళూరువైపునుంచి వచ్చువారు సెంట్రల్ స్టేషనులో దిగెదరు. రామేశ్వరమువైపునకుబోవువారు ఎగ్మూరు స్టేషనులో రైలు నెక్కెదరు. సెంట్రల్ స్టేషను సమీపములో రామస్వామి మొదలియారు సత్రముగలదు. ఎగ్మూరులో కన్నాస్పత్రిదగ్గిర కన్నయ్యశెట్టి సత్రముగలదు. జార్జిటౌనులో వైశ్యుల సత్రముగలదు. అక్కడ ఏకాంబరేశ్వరునిగుడి తిరువల్లిక్కేణిలో సుప్రసిద్ధ



పార్థసారథిస్వామిగుడి మైలాపురములో కపాలీశ్వరస్వామిగుడి ముఖ్యమైనవి సముద్రతీరమునగల విహారస్థలము నౌకాశాల చూడదగినవి పార్కుమ్యూజియము హైకోర్టు గవర్నరు మందిరము కోట అందలి మిలిటరీ నివాసములు గవర్నమెంటు కచ్చేరీలు రివిన్యూబోర్డు ఆఫీసు సెనెటుహౌసు ప్రెసిడెన్సీ కాలేజి పెద్ద ఆసుపత్రి మొదలగునవెన్నో చూడదగిన ప్రదేశములుగలవు. ట్రాముబండ్లు మోటారులు విశేషములుగా గలవు. నగరము మధ్యగా ప్రవహించు కూమునదిలోనికి జలధారలన్నియు చేరుట నగరముస్థితిని తెలియచేయును. ఇచ్చట మౌంటురోడ్డు బీచిరోడ్డు ముఖ్యముగా జూడదగినవి. జనసంఖ్య 5 లక్షలు చెన్నపురికి నుత్తరమున 7 మైళ్ళలో తిరువత్తూరు గలదు. అక్కడ త్యాగరాజస్వామి ఆలయము గలదు.

చిత్రకూటము:— జిఐపిరైలుమీద స్టేషను ఇక్కడనుంచి 3½ మైళ్ళలో చిత్రకూటపర్వతము గలదు. అలహాబాదుకు సమీపము శ్రీరాములవారు అరణ్యవాసమున కొంతకాల మిచ్చటనుండిన ప్రదేశము ఇక్కడి కోటితీర్థము హనుమాంధార ముఖ్యమైనవి.

జంబుకేశ్వరము:— తిరుచునాపల్లి రైలు స్టేషనులో దిగిన శ్రీరంగమునకు బోవు మార్గముననున్నది. పంచలింగములలో చేరిన జలలింగ మిచ్చటగలదు. కావేరీమట్టమునకు దిగువగానున్న గర్భగుడిలో నీలింగమును జలావృతమై యుండగ చూడవచ్చును. పైనీరుతీసినగాని లింగము కన్పించదు. వెంటనే జలావృతమగును. ఈ దేవాలయము మిక్కిలి పెద్దది.

జగన్నాథము:— 'పూరి' స్టేషన వద్ద దిగవలెను. పూరి అని జగన్నాథక్షేత్రమునే బిల్చెదరు వివరములు పూరీని గురించి చూడనగును.

జయపూరు:— మహారాజుయొక్క నివాసము పూర్వము చారిత్రక ప్రఖ్యాతిగాంచిన ప్రదేశము. చూడదగిన స్థలము ఇక్కడిరోడ్లు 40 గజముల వెడల్పుగలిగి మిక్కిలి అందముగానుండును. మధ్య రోడ్డుకలియు చోట మార్కెటులుండును. మ్యూజియము పబ్లికుతోటలు నక్షత్రశోధనశాల రాజగృహము ముఖ్యముగా చూడదగినవి.

జనార్దనం:— మధురనుంచి త్రివేంద్రంపోవు రైలుమార్గమున మణి

యాచీ జంక్షను దాటిన తర్వాత నొక రైలుస్టేషను ఇచ్చట శ్రీజనార్దన స్వామివారి ఆలయము గలదు. శ్రీస్వామి చేతిలో సముద్రజలమును తీసికొనుచున్నటుల నుండును. తిరుపతిలో శ్రీవేంకటేశ్వరస్వామి పోలిక ఇచ్చట స్వామికిగలదు. ఇచ్చటకు చేరువను నవతిరుపతి యను యాత్రాస్థలముగలదు. కన్యాకుమారి శ్రీజనార్దన స్వామిని వివాహమాడుటకై చేతిలో హారమునుధరించియున్నటుల దెలిపెదరు.

ఝాంసీ:-మన్మాడునుంచి ఆగ్రాకుబోవు రైలుమార్గమున గలదు ఇది చారిత్రకమై ప్రసిద్ధిగాంచినది. పూర్వము లక్ష్మీబాయి అను వీర వనిత యుద్ధముచేసినస్థలమని ఆమె ప్రతిమ యిచట గలదు.

డక్కా:—కలకత్తాకు నుత్తరభాగమున నున్నది. మస్లినులకు బూర్వము ప్రసిద్ధిగాంచిన బంగాళారాజ్యమునందలి యొక ముఖ్యపట్టణము. కలత్తానుంచి రైలుమీద 265 మైళ్ళదూరముగలదు. దీనిని ప్రత్యేకముగా చూడదలచినవారే యిచ్చటకుబోయెదరు.

డిల్లి:—హిందూదేశమునకు ప్రస్తుతముఖ్యనగరము. గవర్నరు జనరల్ గారుండుతావు. పూర్వపు హిందూ మహమ్మదీయరాజులిచ్చటనే యుండి హిందూదేశమును పరిపాలించిరి. యమునానది బస్తీనంటియున్నది ఇచ్చటికోటచూడదగియున్నది, ఆగ్రాకోటకునుదీనికిని చాల పోలికగలదు ఇందలి వనితనము చిత్తరువులు ముఖ్యమైయున్నవి. నదిసమీపమున కోతులు హెచ్చుగాగలవు నదిలో హిందువులకుస్నానఘట్టములందు మహమ్మదీయపట్టణమగుటచేత స్త్రీలకు ప్రత్యేకముగను పురుషులకు వేరుగ నేర్పాటులుగలవు. డిల్లీలో పెద్దమసీదు చూడదగినది. అనేక పాతకోటలు పాడుబడినవి డిల్లీకి 12 మైళ్లలోపునగలవు. డిల్లీ దర్వాజా కుతుబుమైనారను గోపురము పృథ్వీరాజు కట్టించిన ఆలయములోని ఇనప ధ్వజస్తంభము నాశ్చర్యమును గలిగింపగలవు. హిందువులు పూర్వకాలమున నిట్టి యినపస్తంభమును పోతబోయుటకు వీరికెట్టి సాధనములుండెనో యని పాశ్చాత్యులమనంబుల గలవరపరచుచున్నది. దీనికి 12 మైళదూరమునందు హస్తినాపురమను పూర్వపు డిల్లీగలదు కురుపాండవులుండిన చోటిది. రైలుస్టేషను బస్తీనంటియున్నది. సత్రములచ్చటచ్చట స్టేషనుకు



దూరముగానున్నవి. అందు లక్ష్మీనారాయణసత్రము ముఖ్యమైనది పూనాలోవలె నిచ్చటను దృష్టిదోషము పాటింపబడుటలేదు. ఆంధ్రబ్రాహ్మణులకు వంటకనుకూలముగానుండుట కష్టముగానుండును. స్టేషనుకు సమీపములో పెద్దహోటల్సుగలవు. వీనిలో అద్దెయిచ్చి వంటచేసుకొనుటకు సదుపాయములుగలవు. అందు మహారాజాహోటల్ హిందువులకే ఏర్పడియున్నది. డిల్లీని పూర్వము ఇంద్రప్రస్థమనెడివారు ఇచ్చటి కోటలోని రంగమహల్ నందలి చిత్తరువులుచూడవలసినవైయున్నవి. జనసంఖ్య 3 లక్షలు. నగరమధ్యమందుగల పెద్దవీధికి చాందినీచౌకనిపేరు. క్రొత్తఢిల్లీలో రాచకీయభవనములు చూడదగినవి.

డెహ్రాడూను:—హరిద్వారమునుంచి ఋషికేశముమీదుగా రైలుమార్గము డెహ్రాడూనుకు గలదు. ఇదిమిక్కిలి చల్లనిప్రదేశము. అరణ్యమిచ్చట ప్రారంభమగును. ఆసంబంధమైన కాలేజిగలదు వేసవికాలములో మస్సూరితోపాటు నిచ్చటకును కొందరు విశ్రాంతికై పోయెదరు ఇచ్చట మతసంబంధమైన విశేషములేదు కాని యిచ్చటనుంచికూడ గంగోత్రికి మార్గముగలదు. మస్సూరికిని నిచ్చటినుంచిపోవలెను పంజాబు ప్రాంతమువారు చల్లదనమునకై వేసవికిచ్చట జేరుదురు.

దర్భశయనము:—మధురనుంచి రామేశ్వరమునకుబోవు రైలుమార్గమున రామనాథపురమను రామనాడు స్టేషనులోదిగి అచ్చటనుంచి 6 మైళ్ళదూరము బండ్లమీద ప్రయాణముచేసిగాని నడచిగాని యాత్రీకులు దర్భశయనము చేరుదురు. ఇచ్చట శ్రీరాములవారు సముద్రముదాటుటకు బూర్వము విశ్రమించినటుల జెప్పెదరు వారధిగట్టినతావిదియని పశ్చిమసముద్రము తూర్పు సముద్రము కలియుచోట రాళ్ళతోను కొండలతోనునున్న ఎత్తుప్రదేశమునటుల అలలమార్పువల్ల గుర్తించుటకు వీలుగల శ్రేణిని గన్పరుచుదురు. ఇక్కడ సముద్రము జగన్నాథములోవలె అలలతో కల్లోలముగానుండును. ఇక్కడ దేవాలయమునందు శ్రీరామమూర్తి విగ్రహముగలదు. ఈప్రాంతములందాలయములలో నాగప్రతిష్ఠలును విశేషముగాగలవు. రావిచెట్టు వేపచెట్టులచుట్టు నాగ ప్రతిష్ఠలును సంతానరహితులగు స్త్రీలు వానిచుట్టు ప్రదక్షిణములుచేయుట సంతాన

నష్టమగువారు నాగ ప్రతిష్ఠలను సలుపుట రామేశ్వరమునందువలె నిచ్చటనుగలదు యాత్రికులుండుటకు సత్రములును కొబ్బరియాకులతో గప్పబడిన చిన్న యిండ్లునుగలవు. ఇచ్చట మంచిదాహోదకము చిక్కుట కష్టము నీటిలో సుద్దకట్టుగలదు.

ద్రాక్షారామము:—దీనినే ద్రాక్షారమందురు. తూర్పుగోదావరిజిల్లాలోనున్నది. ఇచ్చట భీమేశ్వరాలయము ప్రసిద్ధిగాంచినది గలదు. త్రిలింగదేశమున కిదియొక హద్దని ప్రతీతిగలదు. భీమకవినివాస స్థలమ నిచెప్పెదరు. బెజవాడనుంచి విశాఖపట్టణమునకుబోవు రైలుమార్గమున ద్వారపూడిస్టేషనుకు 18 మైళ్ళ దూరములోనున్నది. ఇచ్చట అష్టాదశ శక్తులలో చేరిన మాణిక్యాంబగలదు. ఇచ్చటపెద్దచెరువును ఎంతమందివచ్చినను భోజనమిడు సత్రములుగలవు వసతికి వంటచేసుకొనువారికి నీ సత్రములో సదుపాయములుగలవు ఇచ్చటిఆలయము మిక్కిలి పురాతనమైనది పెద్దది. కాకినాడనుంచి కోటిఫలి మీదుగా రైలువేయబడును.

ద్వారక:—పశ్చిమ సముద్రతీరమునగలదు. పూర్వము శ్రీకృష్ణుడుండి నిర్యాణమందిన స్థలమనిచెప్పుదురు. అట్టిప్రదేశము సముద్రమయమైనదనియు దాని స్థానే చేరువను ప్రస్తుతద్వారకగలదందురు. బొంబాయినుంచి రాజకోటకుబోవు రైలుమార్గమున అహమ్మదాబాదునుంచి మారి వెళ్ళవలెను. మార్గమధ్యమున సిద్ధపూరు అను స్టేషనును మాతృగయయందురు. పితాపురంపాదగయయనియు గయను పితృగయయనియు దీనిని మాతృగయ యనియు నందురు. ఇచ్చట సరియైన దాహోదకము లేదు. భక్తులును కర్మిష్ఠులు ముఖ్యముగా ద్వారక యాత్రచేయుచుందురు. సప్తమోక్షస్థానములలో నిది యొకటి. దీనిని ద్వారావతియనియందురు. పశ్చిమ సముద్రతీరమున దీనికిసమీపములో సోమనాథక్షేత్రముగలదు. ద్వాదశలింగములలో నొకలింగమిచ్చటగలదు. గజ్నీమహమదు ఇక్కడిదేవాలయపు మంచిగంధపు తలుపులను తీసికొనిపోయి ఆగ్రాకోటలో నుంచెను. సోమనాథమునే ప్రభాస క్షేత్రమందురు. ద్వారకలోని దేవాలయ మైదు అంతస్థులు గలది.

దౌలత్ బాదా:—శికందరాబాదునుంచి మన్మాడుకు పోవురైలు



మార్గములో గలదు. ఔరంగబాదా స్టేషనులో దిగి మోటారుమీద చక్కనిరోడున దౌలత్ బాదాకు చేరవచ్చును. ఇచ్చటకొండమీద ప్రసిద్ధమైన కోట దేవాలయము గలవు. ఇవి ముఖ్యముగా చూడదగిన చారిత్రకప్రదేశములు.

నవద్వీపం:—కలకత్తానుంచి పాట్నాకుబోవు రైలు మార్గమున కలదు. సంస్కృత విద్యాస్థానముగ చిరకాలమునుంచి హిందూదేశమున ప్రసిద్ధిగాంచినస్థలము. ధర్మశాస్త్రమునందు ప్రసిద్ధిగాంచిన వారిచ్చట విద్యాభ్యాసముచేసిన వారై యున్నారు.

నవపాషాణము:—చెన్నపురినుంచి రామేశ్వరముకుబోవు రైలు మార్గమున రామనాడ్ స్టేషనులోదిగి అచ్చటినుంచి 10 మైళ్ళు బండిమీద నవపాషాణము పోవలెను. రామనాథపురమున మంచిసత్రములు స్టేషను చేరువనుగలవు. యాత్రికులిచ్చటనుండి ఒకవైపున దర్భశయనమును ఒకవైపున నవపాషాణమును చూచుటకై పోవుచుందురు. ప్రతిదినము వందలకొలది యాత్రికు లీ మార్గముల నడచుచుందురు. తూర్పుసముద్రతీరమున నవపాషాణముగలదు. సముద్రమునంటి కొన్నిపాకలు నిండ్లు గలవు అచ్చటికోనేరులో స్నానముచేసి యాత్రికులు సముద్రస్నానము చేయుదురు. దర్భశయనములో సముద్రము బసకు చాలదూరముగా నుండును. ఇచ్చటమిక్కిలి చేరువ. బసనుండి సముద్రపుటలలనురమ్యముగ జూడవచ్చును. సముద్రములోని నీటిలోనవగ్రహములవిగ్రహములు ఇసుకతో చేయబడినవి గలవు. రామేశ్వరములోని ఆలయమందలి శివలింగము ఇసుకదైనను ఆలయములోపలకు యాత్రికులు కొంతపరిమితిదాటి పోవీలులేనందున దీపపు వెలుతురున చీకటిలో గర్భగుడిలోనుండు విగ్రహముయొక్క సైకతస్థితిని పోల్చుటకు దగిన సావకాశము లేనప్పటికి సముద్రజలములో గొన్నివేల సంవత్సరములనుంచి చెక్కుచెదరని ఇసుకతో నిర్మాణమైన నవగ్రహములను జూచినయెడల ప్రాచీనహైందవుల శక్తిసామర్థ్యములనెంతయుగొని యాడవలసియున్నది. భగవదంశాసంభూతుల నిర్మాణమని పామరజనులేగాక విద్యాధికులైనను నిట్టిచిత్రములుగాంచిన విస్మయమంది తప్పక భగవంతుని ధ్యానింపగలుగుదురు. యాత్రికులచ్చ

ట పితృదేవతల సంతృప్తికై కర్మకాండను జరుపుదురు. పాండాలిచ్చటను దర్భశయనములోనుగలరు. ఈప్రాంతములలో టెంకాయలకుమితిలేదు. దీనిని దేవీపట్నమనిగూడ పిలిచెదరు.

**తిరుపతి:**— దీనిని తిరుమలయని పిలిచెదరు - గూడూరునుంచి పాకాలకుబోవు రైలుమార్గముమీద నున్నది. ఇచ్చట నొక కొండపైన నొకకొండచొప్పున 7 కొండలుగలవు. చివరకొండమీద శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయముగలదు. ఏడుకొండలవాడా అని యాత్రికులు కొండల మెట్ల నెక్కునప్పుడనుచుందురు. మొదటికొండ చాల ఎత్తైనది. చివరకొండకు మోకాళ్లపర్వతమందురు. ఒకమెట్టుకు నొకమెట్టుకు గల ఎత్తు హెచ్చుగానుండును. నడువజాలని వారు డోలీలమీద పోవుదురు. డోలీకి రానుపోను 6 రూపాయలగును. చంద్రగిరినుంచి గుడికి దగ్గరదారి గలదు. అచ్చటనుంచి మెట్లుతక్కువగానుండును. కొండలమీద కోతులు హెచ్చుగానుండును. దారివెంట కుంటి గ్రుడ్డివాండ్రు మొదలగు బిచ్చగాండ్ర సంఖ్య చాలగలదు. కొండదిగువను బస్తీగలదు. ఇచ్చట గోవిందరాజస్వామివారి ఆలయము ముఖ్యమైనది. తిరుపతికి 2 మైళ్లదూరమున తిరుచానూరను అలివేలు మంగాపురం గలదు. ఇది అమ్మవారిగుడి కొండలపై దేవాలయము చూడదగియుండును. అచ్చట కోనేరుగలదు. మ్రొక్కుబడులవారు పుట్టువెంట్రుకల నిక్కడ తీయించెదరు. అట్టి వెంట్రుకల వేలమువలన కొన్నివేల రూప్యములు రాగలవు. అనేకమంది తిరుపతి వెంకటేశ్వరునికి మ్రొక్కుకొని కానుకలు సమర్పించుచుందురు. ఆలయమునందు కట్టుబాట్లు చక్కగనున్నవి, ధర్మకర్త ఉత్తరదేశమునకు జెందినవారైయున్నారు. ఇక్కడ సంస్కృతవిద్యాలయముగలదు. తిరుపతిమునిసిపాలిటీ. రైలునకు 2 మైళ్లలోపున పట్టణముగలదు. బండ్లు స్టేషనువద్ద చిక్కును. బస్తీలో సత్రములు చాలగలవు. పాండాలిక్కడను గలరు. బస్తీకి నుత్తరమున కపిలతీర్థము గలదు. ఇచ్చటయాత్రికులు స్నానము చేయుదురు. రాత్రులందు కొండలపై మెట్లమార్గమున నుండు దీపపుస్తంభములలో దీపములువెలుగుచుండు దృశ్యము చూడదగినది. ఆకాశగంగ, పాపనాశనం, గోగర్భం అను ప్రదేశములు కొండలపైన చూడ



దగినవి. అచ్చటిధారలలో యాత్రికులు స్నానముచేయుదురు. చంద్రగిరిలో కొయ్యలేని రాతికట్టడముగల రాజమహల్ గలదు.

**తిరువన్నామలై:**— విల్లిపురం జంక్షనునుంచి కాట్పాడీకిపోవు రైలుమార్గముననున్నది. ఇది జ్యోతిర్లింగమునకుస్థానము ఇచ్చటదేవాలయము మిక్కిలి సొగసుగానుండును. కోనేరు దక్షిణదేశమునగల అన్ని కోనేరులకంటె మిక్కిలి పరిశుభ్రముగ నుంచబడునదై యున్నది. ఇచ్చట సత్రములుగలవు. నాటుకోటిశెట్ల అన్నసత్రముగలదు. రైలుస్టేషనుకు మైలులోపలనున్నది. చేరవనుకొండగలదు. అక్కడ శివలింగముగలదు. ఇక్కడ తపస్సుచేయు యోగీంద్రులొకరుగలరు. వారికిచాలమందిశిష్యులుగలరు పంచములను బ్రాహ్మణులనేకము చేయబూను కావ్యకంఠ గణపతిశాస్త్రిగారీయూరనుందురు. దీనినే అరుణాచల క్షేత్రమందురు. ఇక్కడి దేవాలయములో ప్రతిరాత్రి వెలుగుచుండునన్ని దీపములు మరియొకచోటను లేవు. ఇందుకగు నూనెకర్చు నాటుకోటిశెట్లు భరించుచున్నారు.

**తిరువళ్ళూరు:**— ఇచ్చట వీరరాఘవస్వామి ఆలయముగలదు. శ్రీరంగములోని రంగనాయకస్వామివారివలె నిచ్చటి విగ్రహముండును. పెద్దకోనేరు గలదు. రైలుస్టేషనుకును బస్తీకిని 2 మైళ్లదూరము గలదు. ఆలయమువద్దకు చిన్నరైలు నడచును. టిక్కట్లు బస్తీలోనమ్మెదరు. కోనేటిలో బెల్లము మణుగులకొలది ప్రతిదినము యాత్రికులవల్ల కలుపబడును. అందరు నీ కోనేటిలో స్నానముచేయుదురు. స్వామివారికి మ్రొక్కుకొన్నవారు చేతికి కడియము ధరించెదరు. ఇచ్చట దొంగలభయము హెచ్చు. కోనేటివద్ద పెద్దసత్రము గలదు. కాని పాత్రసామగ్రి దొరకదు.

**తిరుత్తని:**— కార్వేటినగరం జమీందారీలో ఉన్నది. శ్రావణమాసములోను పుష్యమాసములో ఉత్సవములు జరుగును. వేలకొలది యాత్రికులు వచ్చెదరు. మూడువందల సత్రములు గలవు. కడపనుంచి చెన్నపట్టణమునకుబోవు రయిలున తిరువళ్ళూరు చేరకముందు కలదు. ఇక్కడ స్టేషనుకు పడమర మైలుదూరమున గల కొండమీద కుమారస్వామి ఆలయము కలదు.

**తంజావూరు:**— చెన్నపట్టణమునకు మధురకు మధ్య రైలు

స్టేషను. ఇచ్చట కావేరీనది గలదు. ఇచ్చట బృహదేశ్వరస్వామివారి ఆలయము సుబ్రహ్మణ్యేశ్వరాలయమును మిక్కిలి ప్రశస్తమైన కట్టడములు. పెద్దఆలయముయొక్క నీడ ప్రాకారములో పడకుండునటుల కట్టబడినదని ప్రతీతి గలదు. దేవాలయ మిప్పుడు శికస్తగుచున్నది. పూర్వపురాజుల కాలమున మంచిస్థితిలోనుండి జనాదరణలేక చెడిపోవుచున్నది. రయిలుకు సమీపములో మహారాజావారి సత్రము గలదు. హిందూదేశములో నిట్టి విశాలమైన సౌకర్యములుగల సత్రములేదన్న అతిశయోక్తికాదు. ఇచ్చటి దేవాలయమునందలి నందివిగ్రహము మిక్కిలి పెద్దది. ఈయూర కామాక్షీదేవి యాలయము గలదు. ఇక్కడి దేవాలయగోపురముతో అందమై తుల్యమైనది హిందూదేశములో నెచ్చటను లేదు. శిఖరమున ఒక్కటే నల్లరాతిబండను 5 మైళ్ళ స్లోపునేలను ఎక్కించినటుల తెలియుచున్నది. ఆలయము ప్రాకారములోపల శివసంబంధమైనట్టి గోపురముల మీద విష్ణుసంబంధమైన విగ్రహము లుండుట చిత్రము.

త్రయంబకము:— బొంబాయినుంచి మన్మాడునకుబోవు రయిలు మార్గమున నాసికారోడు స్టేషనులో దిగిన అచ్చటవందలకొలది పాండాలు కనిపెట్టుకొని యుందురు. 7 మైళ్ళదూరమున నాసికపట్టణము గలదు. అచ్చటనుండి మోటారుమీద గంటప్రయాణములో 18 మైళ్లదూరమున నున్న త్రయంబకము చూడవచ్చును. ఇచ్చట త్రియంబకేశ్వరుని ఆలయము గలదు. కొండనుంచి వర్షము కురిసి నప్పుడేర్పడిన జాళ్ళు కనుపించును. ఇచ్చటనుంచి గోదావరి ప్రారంభమైనటుల స్పష్టముగా తెలియగలదు. కొండ దిగువనుగల కొలనులోనికి గోదావరి ప్రవహించి చిన్నవాగుమాదిరి ప్రారంభమై నాసికవద్ద పెద్దకాల్వవలె నుండును. అట్టి గోదావరి రాజమహేంద్రవరమువద్ద నెంతవిరివిగలదో చూడగలము. పాండాలిచ్చటను గలరు. గౌతమఋషి తపస్సుజేసి దక్షిణగంగయనబడు గోదావరిని దెచ్చినస్థలమని పురాణములలో గలదు. ఇచ్చట లింగము జంబుకేశ్వరములోవలె నీటిలోపల నున్నది. ఇచ్చటి లింగము ద్వాదశ లింగములలో నొకటిగ నెన్నబడు చున్నది. పశ్చిమసముద్రమునకు 50 మైళ్ళదూరమున నున్నది. కొండమీద గోదావరి ప్రారంభించుచోటునకు



690 మెట్లెక్కవలెను.

తిరుచునాపల్లి:— చెన్నపురికి మధురకు మధ్యనున్న రయిలు స్టేషను జిల్లా ముఖ్యపట్టణము. కావేరినది చేరువను ప్రవహించును. శ్రీరంగమువరకు బస్తీవ్యాపించి యున్నది. ఇచ్చటి కొండమీది దేవాలయము ముఖ్యముగా చూడదగినది. ఇక్కడనుంచి తంజావూరుకును పుదుచ్చేరికి మోటారులు నడుచును. కావేరికి సమీపమున సత్రములుగలవు. చిన్నయ్యపిళ్ళగారి సత్రములో వర్ణవిచక్షత పాటింపబడకపోవుటవల్ల, యాత్రీకుల కిబ్బందికలదు. మునిసిపల్ సత్రములో తరుచుగ సర్కారుద్యోగస్థులాక్రమించుటచేత యాత్రస్థుల కిబ్బందిగా నుండును.

తోతాద్రి:— చెన్నపురినుంచి త్రివేంద్రంపోవు రయిలు మార్గమున తెంకాశివద్దదిగి యిచ్చటకు మోటారుమీద పోవలెను. ఇచ్చట తోతాద్రినాథుని ఆలయము గలదు. ఇది మార్ధ్వులకు ముఖ్యయాత్ర స్థానము.

తెంకాశి:— మధురనుంచి త్రివేండ్రంబోవు రయిలుమార్గమున గలదు. ఇక్కడికి 3 మైళలో నైరుతిమూలను చల్లని నీటిధారలుగల ఆరోగ్య క్షేత్రమగు కోర్టల్లము గలదు. ఇక్కడి నది పేరు చిత్రా.

నాగపురం:— సెంట్రిల్ ప్రావిన్సెసు అను మధ్యరాష్ట్రములకు ముఖ్యపట్టణము. మన ఆంధ్రులెందరో నీపట్టణములోగలరు. మన్యదేశమైనను కొంతకాలమలవాటుపడి చావగా మిగిలినవారిచ్చటస్థిరనివాసమేర్పరుచుకొని యున్నారు. మన్మాడునుంచి ఇటార్సిమీదుగా ఆగ్రాకుపోవు రైలుమార్గమున ఇటార్సీస్టేషనువద్దనుంచి నాగపురమునకు రైలుమార్గముగలదు. విశాఖపట్టణమునకు కలకత్తాకు బోవు రైలుమార్గమునుంచి ఖరగుపురం స్టేషనునుంచికూడ రైలుమార్గముగలదు. ఇక్కడశీతాబర్డికోట తోటలు గ్రంథాలయము చూడదగినవి.

నాసికా:— బొంబాయినుంచి మన్మాడుకుబోవు రైలుమార్గమున నాసికురోడ్డు స్టేషనుగలదు. ఇచ్చటమోటారులు బండ్లుగలవు. స్టే యిచటకు 7 మైళ్ళుండును. యాత్రాస్థలములు ప్రవేశించునప్పుడు యాత్రీపన్నుఅని మనిషికి పావలావసూలు చేయుదురు. అక్కడ ఒకటోలుగే

టుండును. రైలుదిగకపూర్వమే పాండాలురైలులోనేమనతో కబుర్లుప్రారంభించెదరు. రైలుదిగినవెంటనే యీగలుముసిరినటుల పాండాలువారి ఏజంట్లుయాత్రీకులనుగగ్గోలువరచెదరు. వీరిలోమిక్కిలి కొంచెముగకొందరాంధ్రులుగలరు. చాలమందిమహారాష్ట్రులు యాజ్ఞవల్కీయప్రాంతముల మెండుగాగలరు. ఇక్కడగోదావరిఒకపెద్దకాలవకంటె వెడల్పులేదు20గజములువెడల్పుండును. వరదవచ్చినప్పుడునూరుగజముల వైశాల్యముండును. ఇచ్చట నందినోటనుంచి గోదావరి ప్రవహించునటుల నొనర్పబడినది. యాత్రీకులప్పట్టున స్నానముచేసి తీర్థవిధులను నెరవేర్చుచుందురు. తీర్థవిధులను నెరవేర్చువారు శిరోముండనమునువిధిగా గావించుకొనెదరు. యాత్రీకులలో కొలదిమంది తప్ప మిగిలినవారు పాండాలిండ్లలోనే దిగుదురు పాతకోట పాడుబడిన స్థలము చూడగలము దీనినంటి భద్రకాళీయాలయము గలదు ఈ ప్రాంతముల దేవాలయములు దక్షిణదేశమునందువలె పెద్దగోపురములను గలిగియుండవు సామాన్య గృహములకు వీనికిభేదములేదు ఇచ్చటనుంచి యాత్రీకులు త్రయంబకమునకు మోటారుమీద పోవచ్చును తీర్థవిధులందాంధ్రబ్రాహ్మణులకు వింతగదోచువిధానముగలదు భోక్తలు పట్టుబట్టలు ధరించివచ్చెదరు వీరిలో పెక్కుండ్రు మీసములుగలవారై యుందురు. వీరు మహారాష్ట్ర బ్రాహ్మణులు వీరిలోగొందరు వేదాధ్యయనముచేసినవారుగలరు కాశీలో దప్పనితరస్థలములలో ఘటకవిధిగాని ఆమవిధిగాని యాచరించుటశ్రేష్ఠము. రామాయణమునందలి పంచవటీ ప్రదేశము వీనికి చేరువనుగలదు శూర్పణఖకు ముక్కుకోయబడినచోటగుటచేత నాసికయని పిలవబడుచున్నదందురు ఈ పంచవటీనదులైదు అరుణవరుణ కపిల గౌతమి సరస్వతికలిసి గోదావరిగ నేర్పడుచున్నవి.

పంఢరపురం:—వాడీనుంచి బొంబాయికిబోవు రైలుమీద కురుద్వాడీస్టేషనువద్దదిగి చిన్నరైలుమీద 3మైళ్ళలో పంఢరపురం చేరవచ్చును. షోలాపురం స్టేషనువద్దదిగి మోటారుమీదకూడ బోవచ్చును ఇచ్చట చంద్రభాగ బాహావ భీమనదులు గలవు. ఇచ్చట దేవునిపేరు పాండురంగవిఠలు. అన్నివర్ణములవారు విగ్రహము ముట్టుకొందురు. ఇచ్చట భక్తి హెచ్చు పాండాలసంఖ్యకు మితములేదు. కొన్నివేలమంది గలరు దేవా



లయములో తూర్పుభాగమున గల ఎత్తు స్తంభములు చూడదగియున్నవి పుండరీకాక్షుడను నతడు తలిదండ్రులను విసర్జించి గంధర్వ ప్రేరితమున మాతాపితృలను బూజించమొదలిడి విష్ణువును సరకుచేయలేదని కృష్ణుడు పాండురంగని యాకారమున ప్రత్యక్షమైన స్థలమనియు మొదలగు స్థలపురాణ కథగలదు.

పక్షితీర్థం:—దీనినరవమున తిరుక్కలెకొండ్రం అందరు. చెంగల్పట్టు రైలుస్టేషనునుంచి 9 మైళ్లు జట్కాబండ్లమీదగాని మోటారుమీదగాని పోవలెను. ఇచ్చట కొండక్రింద ఆలయములుగాక కొండమీద వేదగిరేశ్వరుని ఆలయముగలదు ఇచ్చట నొక కొలనుగలదు. అందలి నీరు పసరుపట్టియుండును. కొండమీద ప్రతిదినము 11 గంటలకు 12 గంటలకు మధ్య రెండుపక్షులు వచ్చి పూజారిఇచ్చెడి ఆహారమును గ్రహించుచుండుట యాత్రికులందరు చోద్యముగ చూచుచుందురు. ఈ యూరిలో సత్రములు గలవు. వీనిలోకొన్ని సత్రములు ఆలయములవలె శిలామయములై యున్నవి.

(పాపనాశనం):—చెన్నపట్నంనుంచి అనంతశయమునకు బోవు మార్గమున అంబసముద్రము స్టేషనుకు 5 మైళ్ళు ఇక్కడ రాములవారు రావణునిజంపిన పరిహారమునకై శివుని బూజించిన స్థలమందురు.

ప్రయాగ:—అలహాబాదునకు 2 మైళ్ళు. కాశీకి పశ్చిమమున 74 మైళ్లదూరమున గలదు. ఇక్కడ గంగా యమునా సరస్వతీ నదుల సంగమమును త్రివేణీ సంగమ స్థానమందురు. యాత్రీకులలో పెక్కండ్రు వేణీదానము చేయుదురు. బాజాబజంత్రీలతో కొందరు స్నానమునకు క్రొత్త పంచెల ధరించిపోవుదురు. ప్రయాగకు త్రివేణీసంగమస్థలమునకు 2 మైళ్లు దూరముగలదు. గంగను తీసికొను యాత్రికులు త్రివేణికెగువ భాగమున కుండలతో గంగను తమ బసలకుదెచ్చి పూజచేసి చెంబులలో వేసి సీళ్ళుచేయించి తమతో స్వదేశమునకు దెచ్చికొనెదరు. భారద్వాజాశ్రమం అక్షయవటం మొదలగు ప్రదేశముల నిక్కడ తప్పక యాత్రికులు దర్శించెదరు. ఇక్కడ చూడవలసినవి 'త్రివేణిం మాధవం సోమం భారద్వాజంచ వాసుకీం వందే అక్షయవటం శేషం ప్రయాగ తీర్థనాయకం'

అని పాండాలు చెప్పుచుందురు.

పలనీ:—తిరుచునాపల్లికి మధురకుమధ్యనున్న డిండిగల్ రైలుస్టేష నులో దిగి మోటారుమీద 40 మైళ్ళు బోయిన ఇక్కడకొండమీద సుబ్రహ్మణ్యేశ్వరుని ఆలయముగలదు భక్తులుపాలను స్వామికి సమర్పిం చెదరు. కొండఎక్కునపుడు క్షీరములు పొంగునని ప్రతీతి. సత్రములుగలవు కొండకు సమీపమున కృష్ణయ్యరు సత్రముగలదు. అమ్మనాయక నూరు స్టేషను నుంచికూడ పోవచ్చును. డిండిగల్‌నుంచి మనిషికి 1 రూపాయి మోటారు కగును.

పాట్నా:—పాటలీపుత్రమను పేర చారిత్రక ప్రసిద్ధిగాంచిన బీ హారు రాష్ట్రమునకు ముఖ్యపట్టణము చంద్రగుప్తుడు రాజ్యమేలిన ప్రదే శము గంగగట్టుననున్నది. కాశీనుంచి కలకత్తాకుపోవు రైలుమార్గములో నొకమార్గముననున్నది. రెండవరైలుమార్గము గయామీదుగా బోవును. గయనుంచి 46 మైళ్ళదూరము. గయకు పాట్నాకుమధ్య రైలు గలదు.

పిఠాపురం:—దీనిని పాదగయయందురు సితీపూపు ద్వారకసమీ పమున మాతృగయయని పిలవబడుచున్నది. ఇచ్చట కుక్కుటేశ్వరస్వామి ఆలయముకలదు. మహారాజాగారి ముఖ్యపట్టణము. బెజవాడనుంచి కలక త్తాకు బోవురైలుమార్గముననున్నది. రైలుకు సమీపములో సత్రముగ లదు. వాల్తేరుకు 86 మైళ్ళదూరము పిఠాపురంకు దగ్గిర 16 మైళ్ళలో కొత్తపల్లిరైలు స్టేషను దగ్గరదిగి మైలున్నరదూరములో అన్నవరములో సత్యనారాయణస్వామిని యాత్రికులు చూచెదరు.

పుదుకోట;—ఇది తిరుచునాపల్లికి సమీపముననున్న స్వదేశ సంస్థానమునకు ముఖ్యపట్టణము. ఇచ్చటిరోడ్లు చక్కగనుండును. బృహ దేశ్వరాలయముగలదు ఆంధ్రులనేకులిచ్చట నివాసము కలిగియున్నారు. మోటారుమీద తిరుచునాపల్లినుంచిగాని తంజావూరునుంచిగాని పోవచ్చు ను. కొత్తగా తిరుచునాపల్లినుంచి రైలువేయుచున్నారు. చూడదగిన యూరు తిరుచునాపల్లికి 32 మైళ్ళదూరము.

పుదుచ్చేరి:—దీనిని పాండిచ్చేరీయందురు. ఇది ఫ్రెంచి గవర్న మెంటుకు చెందినది. మహనీయుడగు అరవిందఘోసు ఇక్కడనేయున్నా



డు. ఇక్కడిరోడ్లు విశాలముగా రెండువైపుల ఎత్తైనకాలి బాటలగలిగి యుండును. సముద్రతీరము కన్నులపండువగా నుండును. ఆర్టీసియను నూ తులనగా భూగర్భమునుండి గొట్టములద్వారా నీరు భూమియొక్కపై భా గమునకు ప్రవహించు స్థలములు గలవు. ఇవిముఖ్యముగా చూడదగియు న్నవి. సత్రములుగలవు చెన్నపురినుంచి రామేశ్వరమునకు బోవురైలు మీద విల్లిపురం జంక్షనువద్ద రైలుమార్చి పాండిచ్చేరికి పోవచ్చును. కడ లూరునుంచి మోటారుమీద పోవచ్చును. కస్టముఉద్యోగస్థులు ప్రతివా రినిసోదాచేయుదురు. స్త్రీలనుస్త్రీలేపరీక్షించెదరు. విల్లిపురంకు 19 మైళ్ళు

పూనా:—పూర్వపు పీష్వాల ముఖ్యపట్టణము. బొంబాయి రాజ ధానిలోనిది. జనసంఖ్య లక్షన్నరకు మించినది. స్టేషనుకు సమీపమున పెద్ద సత్రముగలదు. తిలకుమహనీయుని జన్మస్థానము. కొండమీద కనక పార్వతీగుడి కలదు. ఇచ్చటనుంచి మహాబళేశ్వరమునకురోడ్డున 80 మైళ్ళు మోటారులోగాని రైలుమీద వాదారువరకు 46 మైళ్ళు అచ్చటనుంచి 40 మైళ్ళు రోడ్డున వెళ్ళవలెను. మహాబళేశ్వరం కృష్ణానది ప్రారంభమగు స్థలము. కురుద్వాడినుంచి 117 మైళ్ళు. గనేష్‌కండు అను భాగము చూడ దగినది. సర్కారుతోటలు ముఖ్యమైనవి.

పూరి:—దీనినే జగన్నాథమందురు. కలకత్తానుంచి బెజవాడకు పోవు రైలుమార్గమున కుర్దారోడ్డు జంక్షనువద్దదిగి రైలుమార్చి 27 మైళ్ళలో పూరి చేరవచ్చును. ఇది సముద్రతీరము. శ్రీజగన్నాథస్వామి దేవాలయముగలదు. విగ్రహము మంచిగంధపుమానునుంచి చేయబడి నది. ఇక్కడ సర్వం జగన్నాథం అనునటుల ఓఢ్రులు కుండలతో వండిన యన్నము సన్నివర్ణములవారును భుజించెదరు ప్రతిదినము కొన్ని వేల కుండలతో నన్నము వండబడును. ఆవంటశాల చూడదగియున్నది. పాండాలిచ్చటను గలరు. ఆషాఢమునకు ముందు 15 దినములు దేవుని దర్శనము కాదు. అంతట ప్రతిసంవత్సరము ఆషాఢమాసమున జరుగు రథోత్సవమునకు కొన్ని లక్షల ప్రజలు వచ్చెదరు. ఎప్పుడును యాత్రి కులు విరివిగా నిచ్చటకు వచ్చుటచేత సాధారణదినములలో సహితము స్వామి దర్శనము కష్టముమీదగాని లభించదు. మార్కండేయతీర్థములో

స్నానముచేసి ఆలయములోని వటవృక్షమును చూచెదరు. జగన్నాథస్వామికి బలరామునకు సుభద్రకు మొండిచేతులుండుటకు కారణము నియమితకాలమునకు ముందు తలుపులు తెరచి చూచుటచేత అప్పటివరకు విగ్రహము లెంతవరకు సిద్ధమైనవో అటులనే యున్నవందురు. జగన్నాథుని నుదుట మణిగలదు.

బదరీనారాయణము:—దీనినే బదరికాశ్రమమందురు. హిమాలయపర్వతములలో సంవత్సరమున కారు మాసములకు మించి మంచుగడ్డతో నిచ్చట దేవాలయము కప్పబడియుండును. మేనెల ప్రారంభములో మంచు కరుగుట ప్రారంభించగానే వేలకొలది యాత్రికులు హృషీకేశమునుంచి కాలినడకనుగాని డోలీలమీదగాని ప్రయాణము చేయుదురు. మిక్కిలి కష్టమైన మార్గము. ఒకప్రక్క నున్నత హిమాలయ పర్వతశ్రేణి. ఒక ప్రక్క గంగాప్రవాహము. మధ్య నిరువురు ముగ్గురు నడుచుటకు వీలగు మార్గము కలదు. నదివైపు చూచిన కండ్లు తిరుగును. లక్ష్మణ జోలాయను మొదటి మజిలీ హృషీకేశమునకు నాలుగు మైళ్ళలో గలదు. ఇచ్చట గంగ రెండు పర్వతముల మధ్య నూరు గజముల వెడల్పున ప్రవహించును. నదికావల హృషికుల విద్యాలయము గలదు. హృషికేశమునుంచి దారివెంట చాలదూరము అనేకాశ్రమములు గలవు. ఇక్కడ గనబడు సన్యాసులకు సాధులకు మితములేదు. హరిద్వారము నుంచి హృషీకేశమునకు రైలుమీద పోవచ్చును. కాని రైలుస్టేషనునుంచి యూరికి నైదుమైళ్ళుండును. అందుచేత హరిద్వారమునుంచి మోటారు మీద 14 మైళ్ళలో హృషికేశమునకు బోవచ్చును. అక్కడనుండి కాలి నడకను 15 దినములలో బదరీనారాయణము చేరగలరు. ఈదూరము 170 మైళ్ళు. ముందుగా కేదారమునకు బోవునెడల నచ్చటనుంచి నూరుమైళ్ళుండును. ఈ ప్రయాణము చేవల్లను ఉన్నత రాళ్ళ ప్రదేశము నగుటచేత కష్టమైనది. బదరీనారాయణమునకు నూరు గజములదూరములో బ్రహ్మకపాలము గలదు. మ్యాపులోని పంచప్రయాగలు చూడదగినవి. మార్గములో కొండనుంచి నీటిధారలు ప్రవహించుటచే యాత్రికులు నీటికై గంగలో దిగవలసినపనిలేదు. శ్రీశైలయాత్రలోవలె నీటియిబ్బంది లేదు.



మంచు ప్రారంభముకాగానే అర్చకులు జోషిమఠమునకు చేరుదురు. దారిలో వస్తువులు మిక్కిలిప్రియము. కూరలు చిక్కుట కష్టము. యాత్రికుల ఉపయోగమై దారిలో కంబళ్ళు చిక్కును. కర్ణప్రయాగవద్ద పిండారునది అలకనందనది కలియును. ఇక్కడ ఉమాలయమును శ్రీశంకరుల వారు గట్టించిరి. పిండారునదిమీద ఇనపవంతెనకుమధ్య నదిలో స్తంభములు లేవు. ఇక్కడ ధర్మశాల గలదు.

బరోడా:—బొంబాయినుంచి బరోడాకు రైలు మార్గము గలదు. ఇది స్వతంత్ర రాజస్థానము ఇచ్చటి గ్రంథాలయ మెన్నికగాంచినది. మిక్కిలి అందమైన పట్టణము. ఇచ్చటి లక్ష్మివిలాసరాజ భవనము మ్యూజియము చూడదగినవి. బొంబాయికి 248 మైళ్ళు. రాజభవనము అనగా రాజమహాల్ 45 లక్షలు రూప్యములు వెచ్చించి కట్టించబడినది. ఇక్కడ విట్టల్ నారాయణ ఖాండోబా ఆలయములు గలవు. గుండ్రని పెద్ద నూతులు చూడదగినవి. రాజమందిరమున 500 మణులుగల కంఠహారము 10 అడుగుల పొడుగును 6 అడుగుల వెడల్పునుగల మంచిముత్యములతో చేర్చబడిన తివాసి 30 లక్షల రూపాయల ఖరీదుగలదానిని చూచి తీరవలెను. స్టేషనుకు దగ్గిర ధర్మశాల గలదు.

బ్రహ్మకపాళము:—బదరీ నారాయణమునకు నూరు గజముల దూరములో నున్నది. ఇచ్చట బదరీనారాయణమూర్తి ప్రసాదమును దెచ్చి యాత్రికులు పితృదేవతలకు పిండముగా నర్పించెదరు. ఇందువల్ల తిరిగి పితృదేవతలకు పిండములతో నిమిత్తము లేదని కొన్ని పురాణములు స్థలమహాత్మ్యమును తెలుపుచున్నవి.

బృందావనము—ఆగ్రానుంచి డిల్లీకి బోవు రయిలుమార్గమున మట్రా అనబడు మధురస్టేషను గలదు. ఇచ్చటనుంచి 7 మయిళ్ళు గుర్రపు బండ్లమీద బృందావనము చేరవచ్చును. శ్రీకృష్ణుడు కాళింగీమర్దనము గావించిన స్థలము యమునా సమీపమున నూరికి నుత్తరభాగమున గనపరచెదరు. ఇచ్చట పురాతనాలయమునందలి వంకర స్తంభముల పనితనము చూడదగినది. కుంభకోణ వాస్తవ్యులగు రంగాచార్యులుగారు కట్టించిన రంగనాయక స్వామివారి ఆలయము శ్రీరంగాలయమువలె

నూతనశోభతో నొప్పుచున్నది. ఈ దేవాలయమున చాలమంది ద్రావిడ దేశమువారు అర్చకత్వాది విధులను నెరవేర్చుచున్నారు. బృందావనము నుంచి రయిలుమీదకూడ మట్రాకు చేరవచ్చును.

బెజవాడ:— చెన్నరాజధానిలో నాంధ్రరాష్ట్రమునకు భావి ముఖ్యపట్టణము. ఇచ్చట ఆంధ్రవిశ్వవిద్యాలయ పరీక్షాస్థానము గలదు. విశ్వవిద్యాలయము త్వరలో రాగలదు. కృష్ణానది బస్తీకిదక్షిణముగ ప్రవహించును. పెక్కుసత్రములు దేవాలయములుగలవు. వీనిలో రయిలు స్టేషనుకు సమీపములో రామగోపాల్ సత్రమును నదికి దగ్గిర శ్రీకన్యకాపరమేశ్వరీ అన్నసత్రమును ముఖ్యమైనవి. గవర్నరుపేట బోవువారికి కొతాపూర్ణానందంగారి సత్రమును అరండల్ సత్రమును గలవు. కొండమీద శ్రీకనకదుర్గా మల్లేశ్వరస్వామివార్ల ఆలయములు గలవు. కొండచివర అర్జునాలయము గలదు. స్టేషను 5 రయిళ్ళకు కూడలి. రయిళ్లు వచ్చి నప్పు డెక్కువ జనసమర్దముగ నుండును. సబుకలెక్టరు కచ్చేరి సబుకోర్టు మొదలగునవి గలవు. కొన్ని కొండగుహాలు గలవు. అందు కృష్ణకావల ఉండవల్లి గుహాలు ముఖ్యమైనవి. ఇచ్చట కృష్ణ కానకట్ట గలదు. నీటికొళ్ళాయి లున్నవి. మధ్యాహ్నము రాత్రులందు నీటిసప్లయి లేదు. జనసంఖ్య 50,000. వేసవికాలమున ఉష్ణాధిక్యము. వెచ్చనిగాడ్పులు హెచ్చుగానుండును. చెన్నపట్టణమునకు 270 మైళ్ళు. కృష్ణపైన ఒకకొండ చివరనుంచి ఆవలికొండ చివరకు నమర్చబడిన టెలిగ్రాఫుతీగె ప్రపంచములోనికెల్ల మిక్కిలి పొడుగైనది. రైలువంతెన చూడదగినది.

బెంగుళూరు:— మైసూరు రాజ్యములో ముఖ్యపట్టణము. లక్ష జనసంఖ్య. చల్లని ప్రదేశము. ఇచ్చట ఇండ్లు చక్కగనుండును. పార్కులు చూడదగినవి. కోటకు ఢిల్లీగేటు మైసూరుగేటు అని రెండు పెద్దద్వారములు గలవు. ఒక్కరాతిలో చెక్కబడిన 15 అడుగుల శివలింగం మొదలైనవి గుహాలు గలవు. రయిలు టిక్కెట్లు బస్తీలో తాలూకాకచేరీ రోడ్డులోను స్టేషనకుబోవు పెద్దరోడ్డున విక్రయింపబడుటకు స్థలములు గలవు. స్టేషనువద్ద గుర్రపుబండ్లుండును. స్టేషనుకు సమీపములో తోటప్పచెట్టి సత్రమను పెద్దసత్రం గలదు. రాజనగరు శంకరమఠము బస్తీకి



దూరముగ నున్న నీటి సప్లయి ఏర్పాట్లు ముఖ్యముగా చూడదగినవి లాల్‌బాగుతోట కబ్బనుపార్కు రమ్యముగా నుండును. చెన్నపురినుంచి 219 మైళ్లలో బెంగుళూరు పోవు రయిలుమీదప్రయాణము చేయవలెను. జాలారు పేట జంక్షనుకు 87 మైళ్ళు. దారిలో బౌరింగుపేటజంక్షనునుంచి 12 మైళ్లదూరములో కోలారు బంగారు గనులు గలవు.

బొంబాయి:—బొంబాయిరాజధానికి ముఖ్యపట్టణము. నాలుగు వైపుల సముద్రముగల లంకభాగము. జనసంఖ్య 12 లక్షలు ఇచ్చట మేడలు విశేషముగాగలవు. 5 అంతస్థుల మేడలుచాలగలవు. వీధులు విశాలముగనుండును. ట్రాంబండ్లు నడుచును. ఓడలరేవుచూచుటకు రమ్యముగనుండును. పశ్చిమమున మలబారుకొండ సముద్రమునంటి చోద్యముగనుండును. సాయంకాలమచ్చటకు జనులు విహారమునకై బోవుదురు. గవర్నరుగారికచ్చేరీలు బంగాళా హైకోర్టు యంత్రశాలలు మ్యూజియముగలవు రైలుస్టేషనుచాలపెద్దది. దీనిని విక్టోరియాటర్మినస్ అందురు. స్టేషనుకు దగ్గరగానున్న సత్రమొక మైలుదూరముండును. టాంగాలనే గుర్రపుబండ్లు స్టేషనువద్దనుండును. బండికి ముగ్గురేకూర్చునగలరు. మాధవభాగుఅను సత్రము ముఖ్యమైనది. వారములోపల ఎన్నిదినములున్నను వారముదినముల అద్దె ఇవ్వవలెను. ముమ్మాదేవి ఆలయము లక్ష్మీనారాయణ ఆలయముగలవు. మహాలక్ష్మిఆలయము చూడదగినది. సముద్రములో నిచ్చటనుంచి చిన్నబోట్లమీద 7 మైళ్ళుపోవునెడల ఎలిఫాంటా గుహాలుచూడగలము. అచ్చట పెద్దహాలులు ఏనుగులు సంచరింపదగినవి ఒక్కరాతిలోచెక్కబడి యున్నవి. టాజ్మహాల్ హోటల్ ఆంగ్లేయులకు ముఖ్యమైనది. సముద్రముమొగిని ఒక గేటుగలదు. చౌపాటీ ఇసుకమీద లోకమాన్యతిలకుగారి దహనవాటిక గలదు. పూనాకు 115 మైళ్ళు.

భువనేశ్వరము:—కలకత్తానుంచి కుర్దారోడ్డుచేరక పూర్వము వచ్చుస్టేషను. ఇక్కడనుంచి గ్రామము రెండుమైళ్ళున్నది. ఎద్దుబండ్లు గలవు. ఇక్కడి నూతులలో దాహోదకము మిక్కిలి తియ్యగానుండును. బంగాళాదేశపు జనులెందరో ఆరోగ్యముకొరకిచ్చట నివాసము లేర్పరుచు

కొనుచున్నారు. ఇక్కడి ఆలయములకు లింగములకు మితిలేదు. జగన్నాథములోని కుండలవంటకము నిచటకూడ గలదు. ఈశ్వరనారాయణ విగ్రహము నిచ్చట లింగమున జూడవచ్చును. దేవాలయము మిక్కిలి పెద్దది. విగ్రహమునందు జలప్రవాహము గుర్తించనగును. కలకత్తాకు 272 మైళ్ళు ఖుర్దారోడ్డుకు 11 మైళ్ళు. కోసేరును బిందుసరోవరమందురు. పూర్వము 7 వేల ఆలయములుండెనని ప్రతీతి. ఇప్పుడు 500 ఆలయములు గలవు. ముఖ్యమైనది ముక్తేశ్వరుని ఆలయము. ఒఢ్రీలు దేవుని లింగరాజు మహాదేవు అని పిలిచెదరు.

భద్రాచలం:—బెజవాడనుండి శికంద్రాబాదుకు బోవు రైలున 111 మైళ్ళదూరమున డోర్నకల్ జంక్షనులో దిగి రయిలుమారి సింగరేణి బొగ్గుగనులవద్ద కారేపల్లి స్టేషనువరకు రైలుమీద పోవచ్చును. అక్కడ నుంచి రెండుదినముల బండి ప్రయాణముతో భద్రాచలం చేర వచ్చును. ఇప్పుడు మోటార్లు పోవుచున్నవి. చేరువకు రైలుపడుచున్నది. మార్గమంతయు భీకరారణ్యము. ఎర్రుపాలెం స్టేషనువద్దదిగి మూడు దినములలో భద్రాచలం బండ్లమీద పోవచ్చును. కొండపల్లినుంచి తిరువూరుకు మోటారుమీదవెళ్ళి అక్కడనుండి బండ్లమీద పోవచ్చును. బండ్లమార్గము కంటక ప్రదేశము. ఒడ్డు మెరకలు గలిగిన దండకారణ్య భాగము. ఎద్దులబండ్లు మాత్రము పోగలవు. అనేకబండ్లు తలక్రిందులగుచుండును. బెజవాడకు నూరు మైళ్ళదూరము. గోదావరినది కావలి గట్టున రామదాసుగారు కట్టించిన శ్రీ రామాలయము గలదు. చైత్రశుద్ధ నవమికి కొన్నిలక్షల జనులు తలబ్రాలు మహోత్సవమును చూచెదరు. ఆవేడుక చూడదగినది. భద్రాచలమున కైదుమైళ్ళలో ఉష్ణగుండాలని గోదావరియొడ్డున గలవు. ఇసుకలో చలమలు తీయగా నందు మిక్కిలి వేడినీరు వచ్చును. గంధకధృతి వాసనవేయును. ఇక్కడనుండి 22 మైళ్ళు ఒకరాత్రి బండి ప్రయాణములో పర్ణశాలకు బోవచ్చును. శ్రీరాములవారు అరణ్యావాసములో నిచ్చట నుండినటుల జనశృతి. మార్గమధ్యమునగల మహారణ్యమున కొన్నివందల బండ్లతో ప్రయాణమును మధ్యమజిలీలలో చెట్లక్రింద వంటచేసికొనుటకు నచ్చటచ్చట ధర్మాత్ము



లేర్పరచిన అన్నసత్రముల ఏర్పాటును భీకరారణ్యదృశ్యమును చూచి తీరవలసినవై యున్నవి.

పుష్కరం:—బ్రహ్మయజ్ఞము చేసిన స్థలమందురు. బదరీనారాయణ, సావిత్రి వరాహశివ అరుణేశ్వర ఆలయములు గలవు. ఉజ్జయిని నుంచి యిచ్చటకు యాత్రికులు బోయెదరు. పుణ్యతీర్థములన్నిటిలో పుష్కరమే ముఖ్యమైనదిగ నెంచబడుచున్నది. ఉజ్జయినినుంచి రట్లం జంక్షనుమీదుగా అజ్మీరు 292 మైళ్ళు. అజ్మీరు స్టేషనుకు ఆగ్నేయమూలను 7 మైళ్ళు బండిమీద బ్రహ్మక్షేత్రమనే పుష్కర రాజమునకు చేర వచ్చును. బండి కొండ యెక్కదిగును. అందుకు చార్జి హెచ్చుగా తీసికొందురు. కుండములలో స్నానముచేయుదురు. పెద్దచెరువులో మొసళ్ళు గలవు. అజ్మీరునుంచి మట్రాకు రయిలుమార్గము గలదు. బ్రహ్మాలయం ముఖ్యము. అజ్మీరువద్ద అనాసాగరంచెరువు చూడదగినది.

పర్ణశాల:—భద్రాచలమునుంచి 20 మైళ్లు ఒకరాత్రిబండ్లమీద ప్రయాణము చేయవలెను. దారిలో బాటసరిగా నుండక బండ్లు బోల్తా పడుచుండును. ఇచ్చట సీత వనవాసములోనున్న కాలమున రావణుడెత్తుకొనిపోయిన స్థలమందురు.

పంచవటీ:—నాసికా సమీపమున అరమైలులో శ్రీరాములవారు వనవాసములోనుండిన స్థలముగా నచ్చటివారు చెల్పుదురు. పర్ణశాల కంటె పంచవటీతీరమే రామమార్గములో చేరినటుల గన్పడుచున్నది. గోదావరికావలి వైపుననున్నది. శ్రీరామక్షేత్రము. రామాలయములు గలవు. రామగుండమున యాత్రికులు స్నానముచేయుదురు. పంచవటీ రామాలయము 5 మర్రిచెట్లక్రింద నున్నది.

పుష్పగిరి:—కడపకు 8 మైళ్ళ దూరమున నున్నది. ఆంధ్రదేశమున ప్రసిద్ధిగాంచిన మతపీఠమునకు ముఖ్యస్థానము. కమలాపురం స్టేషనుకు 5 మైళ్ళు. ఈ పీఠాధికారము కడపనుంచి కృష్ణకు దక్షిణభాగమున గలదు.

నైమిశారణ్యము:—లక్నోనుంచి హరిద్వారమునకుబోవు రైలు మార్గమున బాలామావురైలు జంక్షనునుంచి 16 మైళ్ళలో చిన్నరైలు బండిమీద నైమిశారణ్య స్టేషనుగలదు. ఇదియే ప్రసిద్ధ నైమిశారణ్య

ప్రదేశము. ఇచ్చట స్టేషనుకు సమీపములో గొప్పసత్రములుగలవు. ఒక చిన్నపల్లె స్టేషనుకు సమీపములోనేగలదు. సత్రములకు సమీపములో చక్రతీర్థమను కోనేరుగలదు. భూమ్యంతర్భాగమునుంచి నదిలోనుంచి నీరు ప్రవహించుటకు సొగసైన ఏర్పాటుగలదు. ఇందలి జలము ఉదయము నాలుగుగంటలప్పుడు సహితము నుష్ణోదకస్నానమున కనుకూలముగానుండును. దీనికి 6 ఫర్లాంగుల దూరమున గోమటీ నదిగలదు. ఇది గంగలో కలియు ఉపనది. నదీతీరమున బ్రహ్మగుండమను మరియొక కోనేరుగలదు. ఇచ్చటనీరు మిక్కిలి చల్లగానుండును. ఇందలి నీరును భూమ్యంతరభాగమునుంచే ధారగా ప్రవహించుచుండును. ఇచ్చటి ఆశ్రమములను వృక్షములను జూచిన పూర్వపు ఋష్యాశ్రమములివియని మనసునకు దోచగలదు. కొన్నివందల సంవత్సరములనాటి వృక్షములుగలవు. పెక్కుమంది గోసాయిలు సన్యాసులు నిచ్చటగలరు. ఇచ్చటనూతులలోని దాహోదకము మిక్కిలి దారుణము చేయును. అభ్రక సంబంధముగలదని దోచుచున్నది. ఇచ్చటకు పదిమైళ్ళదూరములో దారుకావనముగలదు. అచ్చట ద్వాదశలింగములలో నొకటగు నాగేంద్రలింగముగలదు. నైమిశారణ్యమున శివరామదాసు సత్రము నిరంజనదాసు సత్రము ముఖ్యమైనవి. హరిద్వారమునుంచి శాలామావు 160 మైళ్ళు.

మధుర:—చెన్నపట్టణమునుంచి రామేశ్వరమునకు బోవు రైలు మార్గమునగలదు. చెన్నపురి రాజధానిలో చెన్నపట్టణమునకు తర్వాత ముఖ్యనగరము. కృష్ణదేవరాయల భృత్యులగు నాయకులిచ్చట నిర్మించిన రాజగృహమును బోలినది హిందూదేశమునం దెచ్చటనులేదు. అందలి స్తంభములవలయము ఎత్తుకమానుల వైశాల్యము చూచువారికి నాశ్చర్యము గలిగించగలదు. ఆభవనములో నిప్పుడు రెండు జిల్లాలకు జెందిన అన్నిబాపతులకోర్టులు కచ్చేరీలు గలవనిన నది యెంతటిదో యూహింపవచ్చును. రైలుస్టేషనుకు సమీపమున సత్రములుగలవు. వీనిలో మంచియేర్పాట్లుగలవు. ఇదివరలో నన్నసత్రముగా జరుగుచున్నచోట నేడు అద్దెకొని సత్రము వసతికి మాత్రముపయోగపడుట చూచెదము. ఈసత్రము సర్కారు మేనేజిమెంటు క్రిందికి వచ్చినతర్వాత ట్రస్టీలకాలము



నందలి పద్ధతి నవలబింపక భోజనము నపేక్షించువారు తహశీల్దారుగారి నద్దకుబోయి చీటి దెచ్చుకొనవలెనను నిబంధనయుండెనట. ఇది హిందూ ధర్మసాంప్రదాయమునకు విరుద్ధమగుటచేత నెవరును సత్రములో భోజనమునకు వచ్చుటలేక వసతి సత్రముగా మారినది. ఈసత్రమునకు మంచి వసతిగలదు. దాతయొక్క యుద్దేశము నెరవేర్పబడకపోవుటకు నగరవాస్తవ్యుల ఉపేక్షయే ముఖ్యకారణము. ఇచ్చట దేవాలయము దక్షిణదేశమున ప్రసిద్ధిగాంచిన మీనాక్షి అమ్మవారిది. దేవాలయము మంచి స్థితిలోనున్నది. కంచిలో కామాక్షి ఆలయమును మధురలో మీనాక్షి ఆలయమును భక్తులకు ముఖ్యమైనవి. తిరుచునాపల్లికి 99 మైళ్ళు. ఇక్కడి నది వైగా. ఈశ్వరుని పేరు సుందరేశ్వరుడు.

మధురాపురి:—మత్రా అని దీనినందురు. ఆగ్రాకు డిల్లీకి మధ్య రయిలుస్టేషను. కంసుడు రాజ్యమేలి కృష్ణునిచేత వధింపబడినచోటు. యమునాతీరమున గలదేవాలయములకు మితిలేదు. ఇక్కడ పాండాలనేకులుగలరు. తీర్థవిధులకు ముఖ్యమైనచోటు. ఇక్కడ కోతులు హెచ్చుగాగలవు. రైలుస్టేషనుకు నూరికి 3 మైళ్ళదూరముగలదు. ఇచ్చట భక్తివిశేషము. ఇక్కడనుంచి బండ్లమీదనునడచి యాత్రికులు గోకులబృందావనం గోవర్థనపర్వతమును చూచుటకు బోవుదురు. ఇవి అన్నియు మధురాపురికి తల ఒకవైపున నున్నవి. యమునానదియొడ్డున కంససంహారమైన స్థలమున సాయంకాలము సూర్యాస్తమయవేళ యాత్రస్థులందరును హారతినిచ్చువేళ సమావేశమగుదురు. అప్పుడు జేగంటవాయించబడును. కానుకలిచ్చువారిచ్చెదరు. ఆద్రవ్యము గుడి పూజారికి చేరును. సప్తమోక్షస్థలములలో నిదియొకటిగ హిందువులు దలంచుచున్నారు. ఈహారతిఘట్టమున కంసునివధించి కృష్ణుడు విశ్రాంతిజెందినందున విశ్రాంతిఘట్టమని పేరుగలిగినదందురు. అక్రూరఘట్టము ధృవపర్వతము చూడదగినవి. గోవర్ధనపర్వతము భీష్ముని జన్మస్థానముగానెంచెదరు. జనసంఖ్య ఏబదివేలు. డిల్లీకి 91 మైళ్ళు. ఆగ్రాకు 33 మైళ్ళు.

మంగళగిరి:—బెజవాడ కారుమైళ్ళదూరమున గుంటూరుకు బోవు రైలుమార్గమున స్టేషను. ఇక్కడ లక్ష్మీనరసింహస్వామి విగ్రహము

కొండమీదగలదు. పానానరసింగు అని ఉత్తరదేశమువారుపిలుచు పానకాల నరసింహస్వామికి ప్రతిదినము యాత్రికులు బిందెలతో పానకమును సమర్పించుచుందురు. విగ్రహము నోటిలో బిందెలో సగము పానకము బోసినమీదట నంతట శేషించిన పానకము గుటకబడక వెడలగ్రక్కబడును. ఇదియొక అగ్నిపర్వతమని జనులఅభిప్రాయము. ఈపానకమేమగునో తెలియదు. సాధారణముగా బెల్లపురాసులనుదినము నచ్చటకొట్టబడినను చీమలబాధలేదు. కొండదిగువను పెద్ద గోపురముతోనున్న దేవాలయముగలదు. ఇక్కడిగాలిగోపురము కంచిగోపురములకు మించియుండును. ఈయూర రెండు పెద్దకోనేరులగాధముగ గలవు. అందొకటి చీకటికోనేరందురు. ఈయూర నూతులు చాలలోతు. ఉదకబాధ జనులకు గలదు. ఇక్కడసత్రముగలదు. అది గుడికిచేరువ. కోనేటికి సమీపమున బౌలాంబయను పుణ్యాత్మురాలు ప్రతిదినము వచ్చు యాత్రికులకు రాత్రింబవళ్ళు భోజనము నొసంగును. ఉత్సవదినములలో వేలకొలది జనులు వచ్చినను భోజనమిడును. చందాలు వసూలుజేసి-ఒకస్త్రీ యెంత మహత్తరమైన పుణ్యకార్యమును నెరవేర్చుచున్నదో చూచితీరవలెను.

మస్సోరీ:—హరిద్వారమునుంచి ఋషీకేశముమీదగా బోవు రైలుమార్గము చివర డెహ్రాడూను వద్దనుంచి కొంతదూరమున మస్సోరీ గలదు. మిక్కిలి చల్లనిప్రదేశము. పంజాబీలు విశ్రాంతికై యిచ్చటకు బోవుచుందురు.

మహాబళేశ్వరం:—పూనానుంచి మోటారుమీద 80 మైళ్ళ ప్రయాణము రోడ్డుమీద చేయవలెను. ఇచ్చటకృష్ణానది పుట్టినచోటు. చల్లనిప్రదేశము. బొంబాయి గవర్నరుగారు వేసవికాలమందిచట నివాసముగానుందురు. ఇచ్చటి కొండల ప్రదేశము మనోహరముగానుండును. వాదారువరకు పూనానుంచి 46 మైళ్ళు రైలుమీదవెళ్ళి అక్కడనుంచి రోడ్డుమీద 40 మైళ్ళ ప్రయాణముచేసిన నిక్కడకు చేరవచ్చును.

మహాబలిపురం:—చెంగల్పట్టు రైలుస్టేషనులోదిగి బండిమీద 10 మైళ్ళలో పక్షితీర్థమును అచ్చటనుంచి పదిమైళ్ళలో మహాబలిపురమును చూడవచ్చును. ఇది సముద్రతీరము. ఇచ్చట ఒక దేవాలయము సముద్రములో నీటిలో నున్నది. అనగా పూర్వముకంటె సముద్రము దరికి వచ్చినదని యర్థము. అక్కడకు సమీపమున ఒక్కరాతిలో చెక్కబడిన ఏడు దేవాలయములు గలవు. దీనినాంగ్లేయులు ఏడుదేవాలయములు సెవెనుపెగోడాసు అందురు. బలిచక్రవర్తి పాతాళమునకు బంపబడిన ప్రదేశమిదియని ప్రతీతి. ఇచ్చటి కొండమీద నొక చిన్నరోటి గుంటగలదు, అందులోని జలము చెంబు ముంచుటకు మాత్రము వీలుగలదు. కాని మన మెంతజలము తీసినను రోటినిండ జలముండును. అంతకు హెచ్చదు. ఇట్టిపర్వాలు కొండపైన చేయబడుట బహుచిత్రమైనది. ఇచ్చట దేవాలయమును సత్రమునుగలవు. చెన్నపురినుంచి బకింగుహాము కాల్వమీద బోటులో మహాబలిపురమును చేరవచ్చును. కొండగుహలు చూడదగినవి.



మాతృగయ:—అహమ్మదాబాదునుంచి పశ్చిమమున కేగురైలు మార్గమున నున్నది. దీనిని సిడ్‌పూర్ అందురు. ఇదిచాల పుణ్యక్షేత్రముగ పరిగణింప బడుచున్నది. ద్వారకకు బోవువారు తప్పక దీనిని జూచితీరుదురు. అహమ్మదాబాదునుంచి మెహసేనా జంక్షనుకు 42 మైళ్ళు. మెహసేనానుంచి సిడుపూరునకు 22 మైళ్ళు. ఇక్కడ సరస్వతీ నదిగలదు. రుద్రునిగుడి ముఖ్యమైనది. స్టేషనుకు దగ్గిర సత్రముగలదు.

మాయవరం:—చెన్నపురినుంచి మధురకుబోవు రైలుమార్గమున గలదు. రైలుస్టేషనుకు బస్తీ మైలులోపలనున్నది. బస్తీలో సత్రములు గలవు. మయూరనాథుని దేవాలయముగలదు. నూతనముగా నాటుకోటిశెట్లిచ్చట మరియొక్క దేవాలయమును గట్టించుచున్నారు. ఇచ్చట కావేరిలో వేసవిలో నీరుండదు. కోనేరు పాచిబట్టి యుండును. చిదంబరమునుంచి 23 మైళ్ళు. దీనికి మైలుదూరమున చీరెలకు ప్రసిద్ధిగాంచిన కొర్నాడుగలదు.

మైసూరు:—ఇదియొక స్వతంత్రరాజుయొక్క ముఖ్యపట్టణము బెంగుళూరునుంచి మైసూరుకు రైలుమార్గముగలదు. ఇచ్చట మహారాజాగారి జగన్మోహన రాజమందిరము గలదు. చారిత్రక ప్రదేశము. ఇచ్చటనుంచి ఉదకమండలమునకు మోటారు మీద పోవచ్చును. బెంగుళూరుకు 87 మైళ్ళు. ఆగ్నేయమున చాముండికొండమీద చాముండి ఆలయ

ముగలదు. మెట్లమొదట పెద్దనంది 16 అడుగుల ఎత్తుననున్నది. ఇక్కడికి 9 మైళ్ళలో శ్రీరంగపట్టణంగలదు. అక్కడ ఊగులాడు వంతెన చూడదగినది. దగ్గరలో శివసముద్రంనీటి ధారలును తులాకావేరీక్షేత్రమును చూడదగినవి.

మహానంది;—బెజవాడనుంచి గుంతకల్లుకుబోవు రైలుమార్గమున నందియాలువద్ద దిగి 9 మైళ్ళేగిన మహానందిగలదు. ఇచ్చటనంది నోటినుంచి కోనేటిలోనికి నీరు ప్రవహించుచుండును. శివరాత్రికి యాత్రికులు విశేషముగ నిచ్చటకు బోయెదరు. గాజులపల్లిరైలు స్టేషనుకు 3 మైళ్ళు. మహానందేశ్వరుడు నీటిలోనుండును. అచ్చటినుంచి నీరెప్పుడును ప్రవహించుచుండును. నందియాలు బెజవాడకు 189 మైళ్ళు గాజులపల్లికి నందియాలు 9 మైళ్ళు

రామేశ్వరం:—చెన్నపట్టణమునుంచి రైలుమార్గముగలదు. పాంబను స్టేషనువద్ద సముద్రముయొక్క పాయదాటినమీద లంక భాగంలో గలదు. అన్నివైపుల సముద్రము. రామేశ్వరమునకు 11 మైళ్ళలో ధనుష్కోటి స్టేషనుగలదు. అది సముద్రతీరమున నున్నది. ఇచ్చటస్టీమరులు సింహాళం మొదలగు చోట్లకుబోవు చోటుగలదు. స్టీమరుమీద వేలకొలది కూలీలు వలసదేశములకు పోవుచుండుట నిచ్చట చూడవచ్చును. ఇక్కడకు 3 మైళ్ళలో యాత్రీకులు సముద్రస్నానము చేయుదురు, ధనుష్కోటిలో గొప్ప సత్రముగలదు. రామేశ్వరమునకు చేరినవెంటనే యాత్రికులు పండాల యిండ్లలోగాని సత్రములలోగాని బసచేయవచ్చును. ముందు ప్రాయశ్చిత్తస్నానమొక తీర్థమనగా కోనేరులో చేయించెదరు. కొన్ని నూతులే తీర్థములు. ఈ ప్రకారము అనేకతీర్థములలో యాత్రికులు స్నానముచేయుదురు. ఇచ్చట రామలింగేశ్వరస్వామి ఆలయము చాలపెద్దది. కొన్ని లక్షలు ఖరీదుచేయు నగలుగలవు. పదివేలరూపాయల గంగఎప్పుడు నిలవయుండును. ప్రతిదినము కాశీనుంచి వచ్చు యాత్రికులు గంగ చెంబులను స్వామికి సమర్పించుచుందురు. కాశీకి వెళ్ళనివారిచ్చట గంగ కొని స్వామికభిషేకము చేయించెదరు. గర్భాలయమున కెవ్వరిని రానియ్యరు. బ్రాహ్మణులు మొదటి అంతరాళమువరకు కొంతసొమ్ము చె



ల్లించి పోవలెను. రెండవ అంతరాళమువద్ద అందరును స్వామిని దర్శింపవచ్చును. ఆంజనేయప్రతిష్ఠ యనబడు లింగమొకటి పక్కగా వెలుపల గలదు. గుడిలోలింగము ఇసుకతో చేయబడినది. ఇది శ్రీరామప్రతిష్ఠ యని తెలియగలదు. ఇచ్చటి నంది చాల పెద్దది. దీనికి తుల్యమైనది తంజావూరులోగలదు. దేవాలయము నూతనమగు మిక్కిలి విశాలమైన కట్టడములను గలిగి చూచువారికి నాశ్చర్యము గలిగించును. ఇక్కడ యాత్రికులు తీర్థవిధి ప్రకరణమును నెరవేర్చి చుట్టుప్రక్కల గల అనేక తీర్థములను పుణ్యస్థలములను చూచెదరు. ఇవిఅన్నియు శ్రీరాములవారు తిరిగిన ప్రదేశములుగ జూపెదరు. మనిషికి 5 రూపాయలనుంచి తాహతనుబట్టి పాండాలు వసూలుచేయుదురు. ఇదిగాక దానధర్మములు చేయువారికి ననేక విధముల కర్చుమార్గములను గనపరచెదరు. కొందరు యాత్రీకులు నాగప్రతిష్ఠలను చేయుదురు. అందుకు కొంత కట్నము చెల్లించవలెను. ఇచ్చట పాండాలలో ధనికులు సంపన్నులు గలరు. కోడూరు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు మొదలగువారు యాత్రికుల సౌకర్యములను బాగుగా కనుగొనుచుందురు. ఇచ్చటనుంచి యాత్రికులు దర్భశయనం నవపాషాణములు చూచుటకై బోవుదురు. ఒకప్పుడు ముందుగా నవి చూచి రామేశ్వరము చేరువారు కొందరుందురు. రామనాడు స్టేషనుకు 43 మైళ్ళు. రామేశ్వరాలయముయొక్క దర్వాజా నూరడుగుల ఎత్తు.

రాజమహేంద్రవరం:—బెజవాడకు 88 మైళ్ళదూరమున గోదావరినదియొడ్డున బెజవాడనుంచి కలకత్తాకుబోవు రైలుమార్గమున గలదు. కోటిలింగాలపట్టు గోదావరియొడ్డున మిక్కిలి పవిత్రస్థలము. కాశీనుంచి కలకత్తామార్గమున ఆంధ్రదేశమునకు వచ్చుయాత్రీకులు విధిగా రాజమహేంద్రవరంలో దిగి గోదావరి స్నానముచేసి తీర్థవిధులను జరిపి తమతో తెచ్చిన గంగచెంబుల మూతలుతీసి గోదావరి జలమునుకొంత దానిలో చేర్చి తిరిగి మూతలువేయించి తమతో తీసికొనిపోవుదురు. ఇటుల చేయుటవల్ల గంగ ఎంతకాలమైనను చెడదని తెలియుచున్నది. ఇదిగాక గంగయు గోదావరియు నక్కచెల్లెంద్రనియు గంగ గోదావరిని చూడగానే యుప్పొంగునని పురాణములలో గలదు. చెంబుల మూతలు తీసి

వప్పుడు పూర్వము ప్రయాగలో చెంబులు మూయునప్పుడు వెలితిగా నున్నగంగ ఇప్పుడు పైవరకు వచ్చినట్లు గనుపడును. అందులకు గారణ మేమైన గావచ్చును. గంగదప్ప మరియే యితరజలము కొన్ని దినముల కంటె నెక్కువ కాలముంచిన పురుగులుపడి వాసనవేయుట అనుభవమైన విషయమేగదా. రాజమహేంద్రవరములో గోదావరిస్టేషనుకు సమీపమున సత్రములుగలవు. అందు నాళమువారి సత్రము ముఖ్యమైనది. ఇచ్చటి యేర్పాట్లు బెజవాడ శ్రీ కన్యకాపరమేశ్వరీ సత్రముతో పోల్చవచ్చును. రాజమహేంద్రవరం రయిలుస్టేషను నంటియున్నది. ఇది చారిత్రక ప్రదేశము. రాజరాజనరేంద్రుడు రాజ్యమేలినచోటు. నన్నయభట్టు భారతము ప్రారంభించినస్థలము. కాలేజీలున్నవి. పెద్దగ్రంథాలయముగలదు. గోదావరికి ఆవలబడ్డున కొవ్వూరు అను పుణ్యక్షేత్రము గలదు. గౌతమఋషి ప్రమాదమున గోవును చంపెనని అందుకై గోవుపాదములమీదుగా గోదావరి ప్రవహించునని ఇక్కడి స్నానము ముఖ్యమందురు. అచ్చట వేద శాస్త్రపాఠశాల కలదు. రాజమహేంద్రవరములో పెద్ద జైలుగలదు. వితంతూద్వాహము లాంధ్రదేశమున ప్రారంభమైనస్థలము. వితంతు శరణాలయముగలదు. ఆంధ్రకవిత్వములోను సంఘ సంస్కరణములో ప్రసిద్ధిగాంచిన శ్రీ వీరేశలింగకవి యుండినస్థలము. శ్రీనాథాదులు సత్కారములు జెందిన ప్రదేశము. దీనికి చేరువను ధవళేశ్వరమువద్ద ఆనకట్ట చూడదగినది. గోదావరిపైన వంతెన మిక్కిలి పొడవైనది. గోదావరిచెంత గల మార్కండేయాలయము ముఖ్యమైనది. ధవళేశ్వరమున అగస్త్యేశ్వరాలయము గలదు.

లోనవ్లా:— పూనానుంచి బొంబాయికి పోవు రయిలుమార్గమున ననేక కొండగుహాలగుండ రయిలుపోవును. అనేక కొండలమీదుగాను పోవును. కంభము కర్నూలు మధ్య నొకటి రెండిట్టిగుహాలుగలవు. ఇవి ముఖ్యముగా చూడదగినవి. ఈప్రాంతముల పగలు ప్రయాణము చేయుటకు యాత్రికులు హెచ్చరింపబడుచున్నారు. రయిలు కొండలపైన బోవునపుడు చూడగలదృశ్యము అద్భుతముగా నుండును. కొండలపైన రయిలునకు వెనకముందు యింజనులుంచి నడుపుదురు. రయిలు



పోవునపుడు రయిలులోనుంచి చూడవలసినదేగాని యీస్టేషనులో దిగ నక్కరలేదు. ఇక్కడ వసతులేమియు లేవు. పూనాకు 39 మైళ్లు.

లక్నో:— హరిద్వారమునుంచి అలహాబాదుచేరుటకై వచ్చు రయిలుమార్గమున గలదు. దీనిని లక్ష్మణపురి యందురు. పశ్చిమోత్తర రాష్ట్రములకు ముఖ్యపట్టణము. ఇక్కడ చీఫ్‌కోర్టుగలదు. ఇక్కడ మ్యూజియము ముఖ్యముగా చూడదగినది. మహమ్మదీయుల సంఖ్య హెచ్చుగాగలదు. ఇచ్చట సత్రములు రయిలుస్టేషనుకు 2 మైళ్ళ దూరములో నున్నవి. స్టేషను చాలపెద్దది. ఇచ్చటనుంచి కాంపూరునకు బోవుటకు రయిలుమార్గము గలదు. ఒకవైపున అయోధ్యకు రయిలుమార్గము గలదు. బందరురాబర్ట్సనుపేట చౌకువలె నిచ్చట పెద్దచౌకుగలదు. జనసంఖ్య $2\frac{1}{2}$ లక్షలు. చేదీలాల్ సత్రము ముఖ్యమైనది. బాలామావుకు 43 మైళ్ళు. ఇక్కడ నక్షత్రపరిశోధనశాల గలదు. గోమటీమీదనున్న ఇనపవంతెన చూడవలెను.

లాహోరు:— పంజాబురాష్ట్రమునకు ముఖ్యపట్టణము. ఇక్కడ హైకోర్టుకలదు. చల్లని ప్రదేశము. ఢిల్లీనుంచి సరాసరి రయిలుమార్గము గలదు. అంబాలాజంక్షనునుంచి 110 మైళ్ళు. దారిలో అమృతసరమున సిక్కుల బంగారుగుడి గలదు. రావినదికి మైలుదూరము. జాంబాంఫిరంగి మిక్కిలి పెద్దది ఇక్కడ గలదు. జంతువులపార్కు రమ్యముగ నుండును. అనార్కలియను దాసీ అక్బరుకొడుకును జూచి నవ్వినదని పూడ్చబడిన స్థలముగల ప్రదేశమిప్పటికి అనార్కలీ యని పిలవబడుచున్నది.

వరంగలు;—బెజవాడకు శికింద్రాబాదుకు మధ్య రయిలుస్టేషను, పూర్వము ప్రతాపరుద్రుడు రాజ్యమేలినచోటు. పోతనామాత్యుడు భాగవతము రచించిన ప్రదేశము. అనేకదేవాలయములు శిల్పముల నిచ్చట జూడవచ్చును. ఒక్కటే రాయిగల కొండ ఇచ్చటగలదు. మొగలాయి రాజ్యములోనిది. ఇచ్చట జైలుచూడదగినది. బెజవాడకు 130 మైళ్ళు.

వేదాద్రి;— కృష్ణాతీరమున బెజవాడకు 50 మైళ్ళదూరమున నున్నది. ఇచ్చట కొండమీద నరసింహస్వామి ఆలయము గలదు, కోతులువిశేషముగాగలవు. ఆలయమునుంచి కొండదిగువకుగల మెట్లు కృష్ణా

నదిలోనికి గలవు. ఇట్టి దృశ్యము సాధారణముగా నితరస్థలములగాంచుటరుదు. ఈప్రదేశము మిక్కిలి ఆరోగ్యమైనది. అనేకమంది స్త్రీలుసంతానకాంక్షచే నిచట ప్రదక్షిణములు చేయుచుందురు. అందువల్ల లాభమును పొందిన వారనేకులు గలరు. ఈప్రదేశములో ఉత్తరేణుచెట్లు హెచ్చుగా నున్నవి. వీని యందలి ప్రాణవాయువు హెచ్చుగానుండుటయు దక్షిణమున నదిమీదనుంచి వచ్చు మంచిగాలివల్లను ఇది ఆరోగ్యస్థలమైయుండును. శ్రీ ముక్త్యాలరాజాగారి పాలనములోనున్నది.

వైద్యనాథం;— కాశీనుంచి కలకత్తాకుబోవు రయిలుమార్గమున గల పుణ్యక్షేత్రము. పాట్నాకు 151 మైళ్ళు.

శికంద్రాబాదు:—ఘనతవహించిన నైజాంవారి రాజ్యములోనున్నది. దీనికిచేరువ హైదరాబాదాగలదు. అది నైజాంగారి ముఖ్యనగరము. హైదరాబాదా వీధులు చక్కగానుండును. చారుకమాను చారుమీనారు అనబడు ప్రదేశములు చూడదగినవి. ఫాలకనామాయను కోట భాగములో వెలగల వస్తువులనుంచి కాపలాలోనుండుటవల్ల ప్రస్తుత మెవ్వరిని చూడనిచ్చుటలేదు. ఇదిమాత్రము చూడదగిన ప్రదేశములలోముఖ్యమైనది. నదినుంచి బస్తీలకు నీటి సప్లై ఏర్పాటు ప్రదేశము నందలి కట్ట బెంగుళూరునందువలె చూడవలసినదైయున్నది. గోలకొండ దీనికి 6 మైళ్ళలోగలదు. ఆకొండచివరనున్న కట్టడములు బాగుగనున్నవి. భద్రాచలరామదాసుగారిని ఖైదుచేసిన స్థలము నిచ్చటచూపెదరు. హుశ్శేను సాగరుచెరువు హైదరాబాదాకు శికంద్రాబాదుకు మధ్యమైలు పొడుగుననున్నది. కలకత్తానుంచి బరంపురంవచ్చు రైలుమార్గము వెంట చిల్కాసరస్సు కొన్నిమైళ్ళపొడువున గన్పించువిధమును నీహుశ్శేను సాగరు చెరువునచూడదగినది. పశ్చిమముగానున్న బేగముపేటలోని సౌధములందముగానుండును. అచ్చటనుంచి హుశ్శేనుసాగరువెంటనుండు దీపములవరుస చెరువు నీటిలో ప్రతిఫలించు దృశ్యము చూడదగియున్నది. శికంద్రాబాదులో రైలుఎదుట రావూరిశివయ్యగారి చిన్నసత్రముగలదు. హైదరాబాదలోనుసత్రములుగలవు బెజవాడలో రైలుస్టేషనువద్ద పెద్దసత్ర



మును గట్టించిన రామగోపాల్‌గారీయూరివారే. పీర్లపండుగలో నుత్సవములు పోలీసువారు నల్లదుస్తులను ధరించియుండునపుడు చూచితీరవలెను. కొన్నిలక్షల జనులు మొహరముదినమున వీధులలో గన్పడగలరు. ఇక్కడ కోట హైకోర్టుమొదలగునవి పార్కు చూడదగినవి. బొంబాయిలోవలె లక్ష్మీ పుత్రులనేకులిచ్చటగలరు. ఇచ్చట రంగారాయ గ్రంథాలయము రెడ్డి విద్యార్థులవసతిగృహము చూడదగియున్నవి. బెజవాడకు 218 మైళ్ళు

శ్రీకూర్మము:—కలకత్తానుంచి బెజవాడకువచ్చు రైలుమార్గమున శ్రీకాకుళంరోడ్డుస్టేషనువద్దదిగి మోటారుమీద శ్రీకాకుళము పోవచ్చును. అచ్చటినుండి బండ్లమీదశ్రీకూర్మముపోవలెను. రైలుస్టేషనునుంచి శ్రీకాకుళము వెళ్ళకుండా శ్రీకూర్మము బండ్లమీదపోవు మార్గముకలదు. దారిలో లాంగూలెనదియున్నది. శ్రీకూర్మమొకపల్లెటూరు సముద్రమునకు సమీపము. స్నానముచేయుటకు చెరువుగలదు అవతారములలోనొక్కటగు కూర్మావతార స్థలమని చెప్పుదురు. శ్రీకాకుళమునకు శ్రీకూర్మమునకు మధ్యఅర్షవల్లియను గ్రామమున సూర్యవిగ్రహముగలదు. ప్రతి ఆదివారము వేలకొలది యాత్రికులు పాలు గుమ్మడికాయలు తెచ్చి నైవేద్యముచేయుదురు. కండ్లుజబ్బుజేసినవారిచ్చటకు ముఖ్యముగావచ్చెదరు శ్రీకాకుళంరోడ్డు స్టేషనుకు 14 మైళ్ళు.

శ్రీరంగము:—తిరుచునాపల్లి రైలుస్టేషనులోదిగి బండిమీద శ్రీరంగంపోవచ్చును. మధ్యకావేరినదిగలదు. శ్రీరంగంకు ఆవలకొల్లడం నదియున్నది. ఆలయసప్తప్రాకారములమధ్య నూరుగలదు. ఇట్టిపద్ధతి మరి యితరచోట్లలేదు. ఆలయముపెద్దది. శ్రీరంగనాయకస్వామి రాత్రియంతయు మానికెతో ధనరాసులుకొలిచి యలసటజెంది నిద్రించుచు తలక్రింద మానికనుంచుకొనినట్లు విగ్రహముండును. ఇచ్చట వైష్ణవుల యిండ్లెవిశేషముగాగలవు. దాహోదకము నదినుంచి తెచ్చుకొందురు. వైకుంఠఏకాదశి కిచ్చటికిరాగల యాత్రికులసంఖ్య అమితము దక్షిణదేశయాత్రచేయుచు శ్రీరంగము చూడనివారుండరు. ఇతరస్థలములన్నియు జూడకున్నను శ్రీరంగమునకైన బహుమంది యాత్రికులు బోవుచుందురు. హిందూదేశములో నింతపెద్దవైష్ణవాలయము మరియొకటిలేదు. శ్రీరా

మానుజాచార్యులవారి నివాసస్థలమిది.

శ్రీశైలం;—ఇచ్చట కొండపైన భ్రమరాంబామల్లికార్జు నాలయముగలదు. ఈప్రదేశము అరణ్యమందున్నది. బెజవాడనుంచి గుంటకల్‌కు బోవు రైలుమార్గమున మార్కాపురం స్టేషనువద్ద రైలుదిగి అచ్చటనుంచి బండ్లమీద డోరనాల అను గ్రామము చేరవచ్చును. మోటారులుకూడ నంతవరకు పోవును. అక్కడనుంచి కొండలభాగముమీద రోడ్డు చింతల గ్రామమువరకు 10 మైళ్ళదూరముగలదు. ఇక్కడనుంచి అరణ్యము ప్రారంభమగును. నీటి కిక్కడ దిగుడుభావిగలదు. ఇచ్చటనుంచి కాలిమార్గమున కొండలమీదుగా నరణ్యమధ్యమున24మైళ్ళలో శ్రీశైలంగలదు. మధ్యదారిలో 12 మైళ్ళలో చినఅరుట్ల ప్రదేశమువద్ద తాత్కాలిక సత్రపు ఏర్పాటుండును. శివరాత్రికి యాత్రీకులు శ్రీశైలమునకు బోవుదురు. అరుట్లవద్ద ఫారెస్టు బంగాళాగలదు. దాహోదకమునకు నూతులుగలవు. శ్రీశైలం కొండమీద పందిళ్లు పాకలు వేయబడును. యాత్రీకులకు తగు వసతి ఏర్పాటుచేయబడియుండును. వస్తువుల ధరలు రెట్టింపుగానుండును. చింతలనుంచి నడవలేనివారికి 15 రూప్యములతో డోలీచిక్కును. సామానుమోయుటకు కూలీ 5 రూపాయలకు దొరకును. కొండమీద కోనేర్లు నూతులు గలవు. మల్లికాగుండముగలదు. ఇందుయాత్రీకులు స్నానము చేయుదురు. కొండమీద గుడిదగ్గరనుంచి పశ్చిమముగ షుమారు వేయిమెట్లు దిగిన పాతాళగంగయని పిలువబడు కృష్ణానదిగలదు. శ్రీశైల శిఖరం దృష్ట్వాపునర్జన్మ నవిద్యతే యని యాత్రీకులు శిఖరముకనబడగానే హరహరాయని యపరిమిత సంతోషముతో నుప్పొంగెదరు. శైవులు విశేషముగ భక్తితో నీయాత్రకు గడంగెదరు. త్రిలింగములలో నొకటి శ్రీశైలమని యాంధ్ర దేశపుసరిహద్దుగ నెంచబడుచున్నది. మార్కాపురం మార్గముగాక వినుకొండనుంచికూడ జంగాలపల్లిమీదుగా యాత్రీకులు శ్రీశైలంపోయెదరు. ఇచ్చటి భ్రమరాంబికా అష్టాదశ శక్తులలో నొకరు.

శృంగేరి;—శ్రీజగద్గురువులగు ఆదిశంకరులవారి పీఠస్థానము. మైసూరు రాజ్యములోనున్నది. మఠములలో మిక్కిలి భాగ్యవంతమైనది అద్వైత మతస్థులందరికి గురుస్థానము. రైళ్ళకు దూరమగుటచేతను కన్న



డదేశమధ్యమున మారుమూలనుండుటచేత నాంధ్రులంతగా పోవుటకవకాశము తక్కువగా నున్నది. బెంగుళూరునుంచి బిరూరుమీదుగా నరసింహరాజపురంవరకు రైలుమీదవెళ్ళిన అచ్చటికి 34 మైళ్ళబండి ప్రయాణమున శృంగేరిచేరవచ్చును. ఇచ్చట తుంగభద్రా నది గలదు. శారదాంబాలయము శ్రీజనార్దనస్వామి ఆలయము ముఖ్యమైనవి. మంచిరోడు గలదు. ఇది ఋష్యశృంగ మహాఋషియొక్క నివాసస్థలము. శృంగగిరి కొండమీద శారదాంబాలయముగలదు. ఒక్కటేమిక్కిలి వైశాల్యమైన వీధిగలదు. కోడూరుస్టేషనునుంచికూడ పోవచ్చును. అక్కడికి 55 మైళ్ళు.

సింహాచలం:—బెజవాడనుండి కలకత్తాకుపోవు రైలుమార్గమున వాల్టేరుకు సమీపమున ఈ పేరుగల రైలుస్టేషను గలదు గాని యాత్రీకులకు వాల్టేరుస్టేషనులో దిగి సింహాచలమునకు పోవుటసులభము. వాల్టేరుకు 9 మైళ్ళదూరము. కొండపైన సింహాద్రి అప్పలస్వామి అనే వరాహనరసింహస్వామి దేవునిపేరు. ఈ దేవాలయము బహుపురాతనమై మంచి శిల్పచాతురిగలిగి హంపీలోవలె పనితనము చూడనగును. అక్షతదియకు గొప్ప ఉత్సవము జరుగును. విగ్రహము పైనుండు మంచిగంధము నాదినమున నొలిచెదరు. వేలకొలది యాత్రికులు వచ్చెదరు. మంగళగిరి కొండ మెట్లవలె మెట్లుగలవు. దానికి నిరుప్రక్కల పనసచెట్లు పండ్లతోనిండియుండును. నీటిధారలు కొండపైనుంచి ప్రవహించుచుండును. కొండపైన వసతిగృహములు గలవు. ఈఆలయము విజయనగరము సంస్థానమువారి పాలనలో నున్నది. తిరుపతిలోవలె నిచ్చటను వెంట్రుకల మొక్కుబడులుగలవు. యాత్రికులు కొండధారలక్రింద స్నానముచేయుదురు. అట్టిధారలలో మాధవధార మిక్కిలి ముఖ్యమైనదిగ యాత్రీకులు భావించుచున్నారు.

సుబ్రహ్మణ్యము:—పశ్చిమ సముద్రతీరమున నున్నది. సముద్రము సమీపముననున్న ఉడిపిక్షేత్రమునకు 40 మైళ్ళదూరమున గలదు. ఇందు 20 మైళ్ళవరకు మోటారు పోవును. అచ్చటనుంచి ఎడ్లబండ్లమీద పోవలెను. ఇచ్చట సత్రములు గలవు. సుబ్రహ్మణ్యేశ్వరుని ఆలయము

గలదు. అందులో పెద్దపుట్ట ఉన్నది. యాత్రికులు స్వామికి పాలు సమర్పించెదరు.

సాక్షి:—మధ్యరాష్ట్రములనబడు సెంట్రల్ ప్రావిన్సెసులోనున్నది. ఇక్కడ కర్మాగారములు గలవు.

సాక్షిగోపాలం:—పూరిస్టేషనుకు 10 మైళ్ళలోగల రైలుస్టేషను యాత్రికులు పూరీనుంచి యిక్కడదిగి గోపాలస్వామిని దర్శించెదరు.

సింలా:—అంబాలానుంచి రయిలుమార్గము గలదు. ఇది చల్లని ప్రదేశము. ఇండియా గవర్నమెంటువారు వేసవిలో నిచ్చట నుందురు.

షియాలి:—చెన్నపురినుంచి మధురకు బోవు రయిలుమార్గమున నున్నది. చిదంబరం దాటినతరువాత ముఖ్యమైన యాత్రాస్థలము. ఇక్కడ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఆలయముగలదు. ఇక్కడ లింగము చూచువారికి తమఎత్తున నున్నటుల స్ఫురించునను ప్రతీతిగలదు.

హంపి:—దీనిని హంపీ విరూపాక్షమందురు. పూర్వము కృష్ణదేవరాయలు రాజ్యమేలిన విద్యానగరమిదియే. ఇప్పుడంతయు శిథిలమైయున్నది. మహమ్మదీయులిచ్చటి దేవాలయములను పాడుచేసినారు. కొన్నివేల దేవాలయము లిచ్చట నిప్పటికి సిథిలస్థితిలో గన్పడును. వానిలో విరూపాక్షాలయములోని గోపురము మిక్కిలి మనోహరముగా నుండును. ఇచ్చటి నీటికాల్వలు తుంగభద్రనుంచి ఏర్పాటుకాబడి మన కొళాయిలవలె ఇనపగొట్టములలోనుంచి ప్రవహింప చేయక గాలికి నెండకు నవకాశమగు నేర్పాటుతో వంటయిండ్లలో సహితమిట్టి కాల్వలు గలవు. దేవాలయమున కెదురుగ రెండువైపుల రాతి స్తంభములమీద కట్టబడిన రెండంతస్థుల మేడలవరుసలు గలవు. ఈ మేడలపైన జనులు నిలిచి ఉత్సవమును జూచుచుందురని తెలియగలదు, తమలపాకుల బజారని చెప్పబడు వీధియొక్క వైశాల్యము పొడవు చూచిన ఆశ్చర్యము గలుగును. కొంత దూరమునవిఠలదేవాలయము గలదు. ఇందుమధ్యమండపమున 12 విధములగు నరసింహమూర్తి విగ్రహములు స్తంభములమీద చెక్కబడినవి. ఒక్క స్తంభమునకు కావించబడిన శిల్పచాతురి చూచి తీరవలెను, ఒక్క స్తంభములో ననేకవిధములగు విగ్రహములను చిన్న స్తంభములను



పొన్నచెట్టు గోపికాస్త్రీలు మొదలగునవి గల చిత్తరవులు చూడదగినవి. కొన్నివందల సంవత్సరముల నాడు చేయబడిన రంగులు నిన్న మొన్న చేయబడిన వికాసముతో గన్పడును. ఏనుగల మహల్ నిన్నటివరకు నచ్చట ఏనుగులు కట్టబడుచున్న విధమున శుభ్రముగ నున్నది స్నానముల కేర్పడిన తావులు తాలెంఖానాలు మొదలగునవెన్నియో గలవు. హజారు రామాలయమున వేయిరాముని విగ్రహములుగలవు. ఇచ్చటి స్తంభముల పనితనము సొగసుగానుండును. దసరాదిబ్బ పూర్వము దసరాదినమున దర్బారు జరుగు స్థలమును సూచించి చూచువారికి విషాదము కలిగించును ఒక రాతితొట్టె 50 అడుగుల పొడవున గజముఎత్తున నున్నది గలదు. దీనిలో పాలుంచి గుఱ్ఱముల కుపయోగించెదరని చెప్పెదరు. ఇట్టివి చూడదగిన వనేకము గలవు. దేవాలయమునంటి తుంగభద్ర కలదు. చేరువను కిష్కింధయని రామాయణమున బరగు ప్రదేశమును అందు చెప్పబడిన కొండలు, పంపాసరోవరము శబరి ఆశ్రమము వాలి కాష్టము మొదలగునవి అనగొందె సమీపములో చూడనగును. బళ్ళారినుంచి హుబ్లిపోవు రయిలుమార్గమున హాస్పేటవద్ద దిగి అచ్చటనుంచి బండ్లమీద 7 మైళ్లు పోయిన విరూపాక్షాలయము గలదు. దారిలో అనంత పద్మనాభాలయము గలదు. ఈగుడిలో గర్భగుడి మిక్కిలి ఎత్తై లోపల గాలివెలుతురు రాగల ఏర్పాటులను గలిగి కొన్ని వందలమంది ఏకకాలమున స్వామిని సందర్శించుటకు వీలుగలదు. ఇక్కడ విగ్రహము లేదు. దీనిని హిందూపురం ప్రాంతమునకు గొనిపోయి యుంచినటుల చెప్పెదరు. ఆ విగ్రహముకూడ చాల ఎత్తైనదని యచ్చటి ఏర్పాటులవల్ల దెలియును. పాశ్చాత్యులు హంపీని తప్పక తాజ్‌మహల్‌తో పాటు చూచెదరు. శ్రీ విరూపాక్షస్వాములవారి మఠమీ ఆలయమున గలదు. శ్రీ విద్యారణ్యస్వామి భాష్యములు వ్రాసిన స్థలమని ఆలయముప్రక్క నొక గదిలో నున్నని నల్లరాతిని గనపరచెదరు. ఇది చారిత్రిక ప్రధాన స్థలము. యాత్రికులకుముఖ్యమైనది కిష్కింధలోని కొండగుహాలలోనికి చిన్న బిలములగుండ ప్రాకుచు కొంతదూరము చీకటిలో పోయినపిమ్మట విశాలమై నడచుటకు వీలుగల లోపలభాగమున విగ్రహములుండుటయు నచ్చట గాలి వెలుతు

రుండుటయు చీమగాని దోమగాని లేక గండ్రయిసుక పరచినటుల పరిశుభ్రమగు ప్రదేశమును చూడగలము. వీనిని చూచి తీరవలెను.

హరిద్వారము;— ఢిల్లీనుంచి లాహోరు రయిలు మార్గమున అంబాలాజంక్షనువద్దరయిలుమారిన హరిద్వారమునకు బోవును. ఈమధ్య సహారానుపూర్ లాస్కరు అను రెండు జంక్షనులుగలవు. కాని లాహోరు నుంచి హరిద్వారమునకు బోవు ప్రత్యేకరయిలులో నెక్కునెడల రయిళ్ళ మార్పుతో నిమిత్తము లేదు. స్టేషనుకు సమీపములో బస్తీకలదు. కాని స్నానఘట్టము లుండుచోటు 2 మైళ్ళదూరమున గలదు. ఇచ్చట నదిలో బ్రహ్మగుండప్రదేశము కలదు. అచ్చట ప్రతిదినము సాయంకాలము గంగాభేటీ అని హారతి నిచ్చెదరు. అప్పుడు యాత్రికులందరు చేరెదరు. గంగ హిమవత్పర్వతములలో చేరువను మంచుకరిగి మిక్కిలి చల్లగానుండు జలమును గలిగి అతివేగమగు ప్రవాహముతో నొప్పుచుండును. ప్రవాహము వెడల్పు పెద్ద కాలువంతయుండును. వేగ మపరిమితము. వేసవి మధ్యాహ్నమైనను నీటిలో చేయియుంచిన చేతులు కొంకరులు బోవునంత చల్లగా నుండును. మిక్కిలి పరిశుభ్రమైన పావనగంగోదక మచ్చట జూడవచ్చును. చిన్నచిన్న ఆలయములు చాలగలవు. ఆంధ్రదేశమునుండి హరిద్వారమున కేగిన బ్రహ్మనందస్వాములవారు, శంకరాలయము లక్ష్మీనారాయణాలయము మొదలగునవి బ్రహ్మగుండంవద్ద నేర్పాటుచేసి యున్నారు. వారిసహాయము కోరు యాత్రికులకు వసతి యేర్పాటులను వారు చేయుచుందురు. ఇది మాయాపురియను నామాంతరము గల్గి యున్నది. ఇక్కడ కర్మిష్టులు తీర్థవిధులను నెరవేర్చెదరు. మాయాదేవియాలయము కొండ సమీపమున దక్షిణమున దక్షేశ్వరాలయమును జూడదగినవి. గురుకుల ఋషికుల విద్యాలయము లిచ్చటగలవు. ఒకదానిలో వర్ణవిచక్షణలేదు. అదెఆర్యసమాజకులది. దీనినిస్థాపించిన మునిషీరామ్ అనే శ్రద్ధానందస్వామి 1926 సం॥ డిశంబరులో ఢిల్లీలోనొకతురకవల్లచంపబడిరి. రెండవది వర్ణాశ్రమ ధర్మముల ననుసరించి పూర్వాచార పరాయణులచే నిర్వర్తింపబడుచున్నది. ఇక్కడనుండి మోటారునగాని రయిలు మార్గమునగాని 14 మైళ్ళలో నున్న ఋషీకేశమునకు బోవచ్చును. యా



త్రికులు హరిద్వారములో సహితము గంగనుబట్టి తెచ్చెదరనుట గలదు. సప్తమోక్షస్థానములలో నిది నొకటి. ఇది భీముడు తపస్సుచేసిన స్థలమందురు. కురుక్షేత్రమునకు అంబాలా జంక్షనుమీదుగ 131 మైళ్లు. దీనిని శైవులు హరద్వారమనుటగలదు. కపిలమహాఋషి తపస్సుచేసిన స్థలమందురు. బృహస్పతి కుంభరాశిలో ప్రవేశించునపుడు ఇక్కడ కుంభమేళజరుగును. లక్షలకొలది యాత్రికులపుడు వచ్చెదరు. పార్వతీ అగ్నిప్రవేశము చేసినస్థలమును సతీకుండ మందురు.

హిమాద్రి;— బదరీనారాయణమును గురించిన వివరము జూడుడు. హరిద్వారమునుంచి కొండలమార్గమున హృషీకేశమునుంచి కాలినడకను పోవలెను. ఇదిమిక్కిలి శీతప్రదేశము. మంచుకరిగి గంగప్రారంభమగుచోటుగా దీనినెంచెదరు.

హైదరాబాదా;— శికింద్రాబాదును గురించి వివరములు జూడుడు. నైజాం రాజ్యములో చేరినది. శికింద్రాబాదు స్టేషనునుంచి రయిలుగలదు. హైదరాబాదుకు శికింద్రాబాదుకుమధ్యనున్న హుశేనుసాగరు చెరువు విడదీయుచున్నది. హైదరాబాదురోడ్లు జూడదగినవి. దీని కారు మైళ్ళలో గోలకొండగలదు. శికింద్రాబాదుకు 5 మైళ్లు.

హూసంగబాదు:—ఇది మధ్య రాష్ట్రములలో డిప్యూటీ కమిషనరుండు చోటు నర్మదా నదియందలి స్నానఘట్టములు బాగుగా నున్నవి. స్టేషనుకు నది మైలుదూరము. మన్మాడునుంచి ఇటార్సీమార్గమున బోవువారికి నిదియే ముఖ్యముగా విశ్రాంతికి తగిన స్థలము. వసతికి నది యొడ్డున మంచి ఏర్పాటులు గలవు. మన్మాడునుంచి ఇటార్సీమీదుగా ప్రయాణము చేయువారు ఇటార్సీవద్ద దిగునెడల ఇబ్బంది పడగలరు.

---

# ఇతరస్థలములు

అంతర్వేది:—చెన్నపురినుంచి రాజమహేంద్రవరంకుబోవు రైలు మార్గమున నిడదవోలుదగ్గరదిగి పోవలెను. సప్తసాగరయాత్రలో చివర మకాం. గోదావరినదిస్నానము ముఖ్యము. రథోత్సవమునకు చాల మంది యాత్రీకులువచ్చెదరు.

అరిశేకరి:—మైసూరు సమీపమున రయిలుస్టేషను. ఇక్కడ నుంచి 7 మైళ్ళలో బంగారు గనులుగలవు.

ఆబు:—బొంబాయినుంచి 425 మైళ్ళలో ఆబురోడుస్టేషనుగలదు. ఇక్కడనుంచి 17 మైళ్ళలో ఆబుపర్వతముగలదు. ఇక్కడ వృషభనాథుని ఆలయమువంటి సొగసైన ఆలయము హిందూదేశములో మరియొకటి లేదు. ఈఆలయమునకై స్థలము రూప్యములుపరచి ఖరీదుచేయబడినది. ఆలయముకట్టుటకు 18 కోట్లరూపాయిలైనవనిన నెంతటి అలయమో యూహింపవచ్చును. కొండభాగమును చదరముచేయుటకై 56 లక్షల రూపాయిలైనవి.

కాటాస్:—లాహోరుకు 142 మైళ్ళలోనున్న ఖ్యోరాస్టేషనుకు 12 మైళ్ళలోనున్నది. పుష్కరమువంటి పుణ్యక్షేత్రము.

కదిరి:—చెన్నపురికి 399 మైళ్లు. సౌతుఇండియను రైలుమీద స్టేషను ఇక్కడనరసింహస్వామి విగ్రహము చూడదగినది.

కన్యాఆశ్రమము:—హరిద్వారమునకు దక్షిణమున 30 మైళ్ళలో గలదు. రైలుస్టేషను. శకుంతల పుట్టినచోటు.

కంపిలి:—కాన్పూరునకు 82 మైళ్ళలో నున్న ఫతేగర్ స్టేషనుకు 28 మైళ్ళలోనున్నది. ద్రౌపదిపాండవులను వివాహమాడినస్థలము.



కార్లె:—బొంబాయికి 85 మైళ్ళలోనున్న స్టేషను. ఇక్కడహిందూదేశములో నంతట మిక్కిలి సొగసైన గుహాలు గలప్రదేశము.

కరవాది:—చెన్నపట్టణమునకు 188 మైళ్ళదూరము నైరుతిమూల. శ్రీరాములవారు ఖరాసురుని చంపినప్రదేశము.

జ్వాలాముఖి:—నార్తువెస్టురైలుమీద పాతంకోట స్టేషనుకు సమీపము. ఇక్కడలాతమవాలీదేవి ఆలయముగలదు. జలంధర రాక్షస సంహారస్థలము. భూగర్భమునుండి జ్వాలవచ్చుచుండును. ఉష్ణగుండముల ప్రదేశము. భూకంపములు తరుచుగనుండు కాంగ్రా లోయలోనున్నది.

డాకూరు:—బరోడాకు అహమదాబాదుకు మధ్యనున్న ఆనందస్టేషనునుంచి చిన్నరైలుమీద 20 మైళ్ళలో రైలుస్టేషను. స్టేషనుకు $1\frac{1}{2}$ మైళ్ళదూరమున ఆలయముగలదు. ద్వారకలోనున్న కృష్ణవిగ్రహమునుదెచ్చి యిచ్చట దాచినటులచెప్పెదరు. దీనినిచిన్నద్వారకయందురు. ఇక్కడకు 10 మైళ్ళలో లాసుంద్రా ఉష్ణగుండములుగలవు.

డామరాను:—ఈస్టు ఇండియా రయిలుమీద బక్సారు స్టేషనుకు 10 మైళ్ళదూరము. అహల్యశాపవిమోచన స్థానము.

దేవఘర్:—ఈస్టు ఇండియా రయిలుమీద స్టేషను. ద్వాదశలింగములలో చేరిన వైద్యనాథలింగ మిక్కడ గలదు.

బాదామి:—బీజపూరునకు సమీపమున రయిలుస్టేషను, ఇక్కడికి మూడు మైళ్ళలో సుప్రసిద్ధమైన గుహాలుగలవు. బీజపూరునందలి కోటమసీదు చూడదగినవి.

బీరూరు:—మైసూరు సమీపమున రయిలుస్టేషను. దత్తాత్రేయులవారి యాశ్రమమిక్కడ.

బేలూరు:—మైసూరు రాజ్యమున బనవారు రయిలుస్టేషనుకు 28 మైళ్లు, ఇక్కడ చెన్నకేశవస్వామి ఆలయముగలదు. ఇక్కడ రాతిలో

గనపరచబడిన శిల్పచాతురి హిందూదేశమునం దెచ్చటనులేదు.

సకలతీర్థం:—బొంబాయికి 204 మైళ్ళలోగల బ్రోచికి పదిమైళ్ళలో నున్నది. ఇక్కడ స్నానమునకై యాత్రికులు విశేషముగ బోవుదురు.

మఝూరి:—లక్నోకు 110 మైళ్ళదూరమున కటాహిరి స్టేషనుకు మూడు మైళ్ళలో నున్నది. దశరథమహారాజు వేటకేగి అంధమునియొక్క కుమారుడగు శర్వణుని పొరబాటునచంపి శాపము పొందినచోటు.

మిస్రిక్:—లక్నోకు 53 మైళ్ళలోనున్న సీతపూరు స్టేషనుకు 13 మైళ్ళు, దధీచి తన శరీరమును కండలుగాగోసి దానమిచ్చిన స్థలము.

ములకలచెరువు:—చెన్నపట్టణమునకు నైరుతిని 316 మైళ్ళ దూరమున రయిలుస్టేషను. ఇక్కడి ఆలయమందలి ధ్వజస్తంభము 80 అడుగుల ఎత్తుగలది చూడతగినది.

సాంచి:—డిల్లీనుంచి ఆగ్రాబ్రాంచి రైలుమీద డిల్లీకి 409 మైళ్ళ దూరమునగల స్టేషను, ఇక్కడ బౌద్ధస్తూపము మిక్కిలి పెద్దది గలదు. బొంబాయినుంచి 555 మైళ్ళలో భిల్సాస్టేషనుకు సమీపము.

సహాజోలు:—దీనినే విరాటపురమందురు. కలకత్తాకు 565 మైళ్ళ దూరమున బెంగాలు నాగపూరు రయిలుమీదనున్న స్టేషను, పాండవు లజ్ఞాతవాసమున విరటుకొలువున నున్నచోటు. ఇక్కడ శమివృక్షము నిప్పటికిజనులు పూజించుచున్నారు.

---



# రైల్వే సమాచారము — రేటు — కాలపరిమితి.

| రైలు వివరము | రైలుచార్జి | ఏస్టేషనునుంచి రైలు బయలుదేరునది | ఏస్టేషనుకు | రైలుచేరువేళ | రెండుస్టేషనులమధ్య దూరము | ఎన్నిగంటల ప్రయాణము | రైలు వివరము |
|---|---|---|---|---|---|---|---|
| నైజాం రైలు | 4_0_0 | బెజవాడ రాత్రి 12_30 | శికిందరాబాదు పగలు 8_30 | | 216 | 8_0 | మెయిలు |
| జి. ఐ. పి. రైలు | 4_13_0 | సికిందరాబాదు రా॥ 9_30 | కురుద్వాడీ పగలు 11_40 | | 250 | 14_10 | ఎక్స్ప్రెసు |
| బార్సీలైటు ,, | 0_10_9 | కురుద్వాడీ పగ॥ 3_50 | పంఢరపురం సాయం॥ 6_36 | | 32 | 2_0 | చిన్నరైలు |
| ,, | 0_10_9 | పంఢరపురం సా॥ 6_0 | కురుద్వాడీ రాత్రి 8_0 | | 32 | 2_0 | ,, |
| జి.ఐ.పి. రైలు | 2_5_0 | కురుద్వాడీ రా॥ 11_0 | పూనా ఉదయం 5_30 | | 115 | 6_30 | లోకల్ |
| ,, | 3_12_6 | పూనా పగ॥ 7_45 | బొంబాయి పగలు 12_15 | | 122 | 4_30 | ఎక్స్ప్రెసు |
| బి.బి.సి.ఐ. రైలు | 4_8_0 | బొంబాయి రాత్రి 9_0 | బరోడా ఉదయం 6_40 | | 240 | 9_40 | ,, |
| ,, | 1_2_0 | బరోడా పగలు 11_15 | అహమదాబాదు పగలు 2_46 | | 62 | 3_30 | ,, |
| ,, | 0_11_0 | అహమ్మదాబాదు ఉ॥ 6_55 | మెహసేనా పగలు 9_42 | | 43 | 2_50 | ,, |
| ,, | 0_5_0 | మెహసేనా ,, 7_15 | సిద్ధపూరు ,, 8_59 | | 21 | 1_45 | లోకల్ |
| ,, | 0_5_0 | సిదుపూరు ,, 9_39 | మెహసేనా ,, 11_10 | | 21 | 1_45 | ,, |
| ,, | 1_8_0 | మెహసేనా పగలు 11_25 | వఢ్వాను సాయం 5_10 | | 81 | 6_0 | ,, |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ,, | 1-6-0 | పడ్వాను ,, | 2-50 | రాజకోట ,, | 6-55 | 75 | 4-0 | మెయిల్ |
| ,, | 3-11-6 | రాజకోట ,, | 10-20 | ద్వారక రాత్రి | 8-15 | 138 | 10-0 | లోకల్ |
| ,, | 3-11-6 | ద్వారక ,, | 8-0 | రాజకోట సాయం॥ | 6-30 | 138 | 10-30 | [illegible] |
| ,, | 2-2-0 | రాజకోట ,, | 10-25 | వీరమాగం ,, | 5-50 | 115 | 7-30 | ,, |
| ,, | 0-12-0 | వీరమాగమ్ ,, | 10-10 | అహమ్మదాబాద్ ప॥ | 12-45 | 41 | 2-30 | [illegible] |
| ,, | 1-2-0 | అహమ్మదబాద్ , | 7-39 | బరోడా ,, | 10-7 | 62 | 2-30 | ఎక్స్‌ప్రెసు |
| ,, | 4-8-0 | బరోడా ,, | 10-17 | బొంబాయి ,, | 8-8 | 248 | 10-0 | ,, |
| జి.ఐ.పి. రైలు | 3-1-0 | బొంబాయి రాత్రి | 11-45 | నాసికురోడ్డు ఉదయం | 7-6 | 117 | 7-20 | లోకల్ |
| ,, | 0-15-0 | నాసికురోడ్డు ప॥ | 1- 0 | మన్మాడు పగలు | 4-30 | 45 | 3-30 | ,, |
| నైజాం రైలు | 1- 2- 0 | మన్మాడు రా॥ | 3-45 | ఔరంగబాద్ ఉ॥ | 6-30 | 71 | 2-45 | ,, |
| ,, | 1- 2- 0 | ఔరంగబాద్ ప॥ | 1-51 | మన్మాడు ప॥ | 4-41 | 71 | 3-10 | ,, |
| జి.ఐ.పి. రైలు | 1- 4- 0 | మన్మాడు , | 10-1-7 | పచోరా , | 2-30 | 70 | 4-15 | ,, |
| ,, | 0- 8- 0 | పచోరా , | 3-15-0 | పెందుర్ని , | 4-40 | 18 | 1-30 | ,, |
| ,, | 0- 8- 0 | పెందుర్ని , | 12-30 | పచోరా , | 2-10 | 18 | 1-40 | ,, |
| ,, | 2- 6- 0 | పచోరా , | 2-30 | కాండ్వా రాత్రి | 8-15 | 121 | 5-45 | ఎక్స్‌ప్రెసు |
| ,, | 2- !- 0 | కాండ్వా , | 10-0 | ఫతేబాద్ సా॥ | 6- 2 | 174 | 8-0 | ,, |
| ,, | 0- 4- 6 | ఫతేబాద్ రాత్రి | 8-47 | ఉజ్జయని రాత్రి | 9-40 | 15 | 1-0 | ,, |
| ,, | 2- 6- 0 | ఉజ్జయని పగలు | 10-55 | భూపాల్ పగలు | 4-50 | 114 | 6-0 | ,, |



| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ,, | 3- 6- 0 | భూపాల్ రాత్రి | 11-15 | ఝాంసీ ,, | 10-15 | 193 | 11-0 | ,, |
| | 2-12-0 | ఝాంసీ పగలు | 11-50 | ఆగ్రా రాత్రి | 7-5 | 133 | 7-15 | ఎక్స్‌ప్రెసు |
| బి.బి.సి.ఐ | 0-12-0 | ఆగ్రా పగలు | 1-30 | మట్రా పగలు | 3-15 | 33 | 2-0 | లోకల్ |
| జి.ఐ.పి. | 1-14-0 | మట్రా పగలు | 1-15 | ఢిల్లీ సాయం | 6-15 | 91 | 5-0 | ఎక్స్‌ప్రెసు |
| | 1-11-6 | ఢిల్లీ పగలు | 2-45 | కురుక్షేత్రం రాత్రి | 7-30 | 97 | 4-45 | ,, |
| ఎన్. డబ్బిల్యూ | 2-6-0 | కురుక్షేత్రంరాత్రి | 7-30 | హరిద్వారం ఉదయం | 6-30 | | 11-0 | లోకల్ |
| ఈస్టుఇండియా | 5-11-0 | హరిద్వారంరాత్రి | 7-15 | బాలామావు ఉద॥ | 5-45 | 255 | 10-30 | ఎక్స్‌ప్రెసు |
| | 0-5-0 | బాలామావు ప॥ | 9-0 | నైమిశారణ్ పగలు | 11-0 | 16 | 2-0 | లోకల్ |
| | 0-5-0 | నైమిశారన్ ఉ॥ | 6-0 | బాలామావు పగలు | 7-0 | 16 | 2-0 | ,, |
| | 1-1-0 | బాలామావు ప॥ | 7-0 | లక్నో పగలు | 10-35 | 45 | 3-30 | ,, |
| | 1-10-0 | లక్నో రాత్రి | 9-30 | అయోధ్య రాత్రి | 4-0 | 81 | 6-30 | ,, |
| | 2-4-0 | అయోధ్యపగలు | 1-0 | ప్రయాగ రాత్రి | 8-0 | 101 | 7-0 | ,, |
| బి.ఎన్.డబ్ల్యు | 1-11-0 | ప్రయాగ రాత్రి | 12-0 | కాశీ పగలు | 7-10 | 74 | 7-30 | ,, |
| ఈస్టుఇండి } | 2- 6-0 | కాశీ పగలు | 3 35 | గయ రాత్రి | 12 35 | 137 | 9-0 | లోకల్ |
| యారైలు } | 0-12-3 | గయ ,, | 2 0 | పాట్నా పగలు | 4 55 | 46 | 3-0 | [illegible] |
| | 2- 5-0 | పాట్నా ,, | 10 31 | జసీధ్ సాయం. | 6 16 | 129 | 7-45 | [illegible] |
| | 0- 1-0 | జసీధ్ ,, | 6 40 | వైద్యనాథం ,, | 7 0 | 4 | 0-20 | [illegible] |
| | 0- 1-0 | వైద్యనాథం,, | 8 15 | జసీధ్ ,, | 8 35 | 4 | 0-20 | [illegible] |

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 2_12_6 | జసీథ్ | ,, | 12 6 | హౌరా, కలకత్తా | రాత్రి | 7 35 | 151 | 7_30 | ఎక్ప్రెస్ |
| బి.ఎన్. రైలు | 6_11_0 | హౌరా | రాత్రి | 8 | భువనేశ్వరం | ఉదయం | 6 30 | 272 | 10_30 | |
| | 0_11_0 | భువనేశ్వరం | పగలు | 2 30 | పూరి | పగలు | 4 30 | 38 | 2_0 | |
| | 0_ 9_0 | పూరి | ,, | 8 20 | కుర్దారోడ్డు | ,, | 10 0 | 27 | 1_40 | |
| | 3_ 6_0 | కుర్దారోడ్డు | రాత్రి | 9 15 | శ్రీకాకుళంరోడ్డు | ,, | 7 19 | 183 | 10_0 | |
| | 1_8_0 | శ్రీకాకుళంరోడ్డు | పగ॥ | 9 43 | వాల్తేరు | ,, | 12 53 | 81 | 3_10 | మెయిలు |
| ఎమ్. ఎస్. | 1_9_0 | వాల్తేరు | ఉయం | 6 0 | పిఠాపురం | ,, | 10 13 | 93 | 4_10 | ఎక్ప్రెస్ |
| ఎమ్. రైలు | 0_7_0 | పిఠాపురం | పగలు | 10 13 | ద్వారపూడి | ,, | 11 56 | 26 | 1_40 | |
| | 0_3_0 | ద్వారపూడి | ,, | 7 29 | రాజమహేంద్రం | ,, | 8 0 | 13 | 0_30 | |
| | 0_1_0 | రాజమహేంద్రం | ,, | 8 25 | కొవ్వూరు | ,, | 9 0 | 4 | 0_30 | |
| | 1_6_0 | కొవ్వూరు | ,, | 1 15 | బెజవాడ | ,, | 6 5 | 88 | 5_10 | |
| | 0_2_0 | బెజవాడ | ఉదయం | 6 30 | మంగళగిరి | ,, | 7 28 | 7 | 1_0 | చిన్నరైలు |
| | 0_3_0 | మంగళగిరి | పగలు | 7 28 | గుంటూరు | ,, | 8 17 | 12 | 1_0 | |
| | 0_4_0 | గుంటూరు | ,, | 8 17 | ఫిరంగిపురం | ,, | 9 41 | 13 | 1_30 | |
| | 0_4_0 | ఫిరంగిపురం | ,, | 9 41 | నర్సారావుపేట | ,, | 10 50 | 15 | 1_10 | |
| | 0_6_0 | నర్సారావుపేట | ,, | 10 50 | వినుకొండ | ,, | 12 39 | 23 | 1_30 | |
| | 0_10_0 | వినుకొండ | ,, | 12 39 | మార్కాపూరు | ,, | 3 52 | 39 | 3_20 | |
| | 1_1_0 | మార్కాపూరు | ఉ॥ | 6 23 | గాజులపల్లి | ,, | 11 51 | 70 | 5_30 | |



| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 0_3_0 | గాజులపల్లి | ,, | 11 51 | నందియాల | ,, | 12 18 | 9 | 0_30 | |
| 0_12_0 | నందియాల | ,, | 12 18 | ద్రోణాచలం | ,, | 3 57 | 48 | 3_40 | |
| 0_9_3 | ద్రోణాచలం | ,, | 10 55 | కర్నూలు | ,, | 1 0 | 32 | 3_0 | |
| 0_9_3 | కర్నూలు | ,, | 7 30 | ద్రోణాచలం | ,, | 10 20 | 32 | 3_0 | |
| 0_10_0 | ద్రోణాచలం | ,, | 4 20 | గుంటకల్లు | రాత్రి | 7 25 | 43 | 3_0 | |
| 1_5_0 | గుంటకల్లు | ,, | 8 30 | హాస్పేట | పగలు | 12 30 | 71 | 4_0 | |
| 1_7_0 | హాస్పేట | ,, | 12 50 | హుబ్లి | సాయం॥ | 5 45 | 89 | 5_0 | |
| 2_8_0 | హుబ్లి | ,, | 8 35 | మిరజ్ | రాత్రి | 7 25 | 173 | 11_0 | |
| 0_8_9 | మిరజు | ,, | 11 30 | కొల్లాపురం | పగలు | 1 30 | 30 | 3_0 | |
| 5_12_9 | కొల్లాపురం | ,, | 3 5 | హుబ్లి | మరునాడు | 8 15 | 364 | 17_0 | |
| | హుబ్లి | ,, | 9 30 | గుంటకల్లు | రాత్రి | 7 10 | | 10_0 | |
| 1_13_0 | గుంటకల్లు | రాత్రి | 7 55 | కడప | ఉదయం | 5 55 | 114 | 10_0 | పెద్దరైలు |
| 1_12_0 | కడప | పగలు | 1 15 | తిరుత్తని | సాయం | 6 38 | 86 | 5_20 | |
| 0_6_0 | తిరుత్తని | ,, | 1 11 | తిరువళ్ళూరు | ,, | 2 48 | 25 | 1_30 | |
| 0_7_0 | తిరువళ్ళూరు | ,, | 2 53 | చెన్నపట్టణం | ,, | 4 50 | 26 | 2_0 | |
| 0_11_0 | చెన్నపట్టణం | ఉద. | 6 20 | చెంగల్పట్టు | పగలు | 8 20 | 35 | 2_0 | |
| 0_ 6_0 | చెంగల్పట్టు | ఉద. | 6 30 | కంచి | | 7 41 | 22 | 1_10 | |
| 0_ 6_0 | కంచి | ,, | 7 19 | చెంగల్పట్టు | ,, | 8 25 | 22 | 1_10 | |

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1_5_0 | చెంగల్పట్టు | పగలు | 8 50 | విల్లిపురం | ,, | 1 20 | 64 | 3_10 | |
| 0_12_3 | విల్లిపురం | ,, | 3_10 | తిరువన్నామలై | ,, | 5 46 | 42 | 2_30 | |
| 1_3_6 | తిరువన్నామల | ,, | 8 30 | పుదుచ్చేరి | ,, | 5 0 | 65 | 4_0 | |
| 0_7_3 | పుదుచ్చేరి | ,, | 11 45 | విల్లిపురం | ,, | 2 15 | 19 | 230 | |
| 1_1_0 | విల్లిపురం | ,, | 12 2 | చిదంబరం | ,, | 3 4 | 52 | 3_0 | |
| 0_3_6 | చిదంబరం | ,, | 3 4 | షియాలి | ,, | 3 42 | 11 | 0 40 | |
| 0_4_0 | షియాలి | ,, | 3 42 | మాయవరం | ,, | 4 21 | 12 | 0 40 | |
| 0_6_6 | మాయవరం | ,, | 4 21 | కుంభకోణం | ,, | 5 47 | 20 | 1 20 | |
| 0_6_6 | కుంభకోణం | ,, | 7 40 | తంజావూరు | ,, | 8 58 | 24 | 1_20 | |
| 0_10_9 | తంజావూరు | ,, | 11_22 | తిరుచునాపల్లి | ,, | 1_10 | 31 | 2_0 | |
| 2_0_0 | తిరుచునాపల్లి | ,, | 10_50 | మధుర | ,, | 4_0 | 99 | 5_10 | |
| 1_1_0 | మధుర | ,, | 11_34 | రామనాడు | ,, | 2_14 | 55 | 2_40 | మెయిలు |
| 0_12_0 | రామనాడు | ఉద. | 5_ 24 | రామేశ్వరం | ,, | 7_18 | 41 | 2_0 | |
| 0_2_3 | రామేశ్వరం | ,, | 7_18 | ధనుష్కోటి | ,, | 7_45 | 11 | 0_30 | |
| 2_0_0 | { ధనుష్కోటి | ,, | 10_20 | రామనాడు | ,, | 12_21 | 107 | 2_0 | మెయిల్ |
| | { రామనాడు | | 1_20 | మధుర | ,, | 5_15 | | 4_0 | లోకల్ |



| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 2_0_0 | మధుర | ,, | 11_50 | మణియాచి | ,, | 3_45 | 79 | 4_0 | |
| 1_11_0 | మణియాచి | ,, | 7_50 | తెంకాశి | ,, | 11_49 | 63 | 4_0 | |
| 2_10_0 | తెంకాశి | ,, | 11_49 | త్రివేంద్రం | ,, | 6_55 | 101 | 7_0 | |
| | | | | సాయం | | | | | |
| 2_10_0 | కాలికట్టు | ,, | 12_22 | మంగుళూరు | ,, | 5_25 | 137 | 5 | మెయిల్ |
| 3_9_0 | మంగుళూరు | ,, | 7_20 | షోరనూరు | ,, | 3_11 | 190 | 8_0 | |
| 1_4_0 | షోరనూరు | ,, | 4_19 | పోదనూరు | ,, | 6_19 | 58 | 2_0 | |
| | | | | సాయం | | | | | |
| 1_2_0 | పోదనూరు | ,, | 8_0 | ఉదకమండలం | ,, | 2_40 | 55 | 6_40 | |
| 1_2_0 | ఉదకమండలం | ,, | 12_5 | పోదనూరు | ,, | 6_42 | 55 | 6_40 | |
| | | | | సాయం | | | | | |
| 3_0_0 | పోదనూరు | ,, | 8_40 | జలారుపేట | రాత్రి | 9_25 | 170 | 13_0 | |
| 1_6_0 | జలారు పేట | ,, | 12_25 | బెంగుళూరు | ,, | 7_15 | 87 | 7_0 | |
| 1_12_0 | బెంగుళూరు | ,, | 3_0 | మైసూరు | ,, | 730 | 87 | 4_30 | |
| 1_12_0 | మైసూరు | ,, | 3_20 | బెంగుళూరు | ,, | 7_25 | 87 | 4_0 | |
| 2_0_0 | బెంగుళూరు | ,, | 7_15 | బీరూరు | పగలు | 3_41 | 131 | 8_30 | |
| 0_4_9 | బీరూరు | ,, | 4_5 | తరికేరి | ,, | 5_6 | 16 | 1_0 | |
| 0_8_0 | తరికేరి | ,, | 8_45 | నరసింహారాజపురం | ,, | 12_40 | 27 | 2_40 | |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 0_8_0 | నరసింహా రాజపురం | ,, | 1_ | తరికేరి | ,, | 4_55 | 27 174 | 4_0 |
| 2_4_9 | తరికేరి | ,, | 8_43 | బెంగుళూరు | ,, | 6_35 | | 10_0 |
| 1_9_0 | బెంగుళూరు | ,, | 7_30 | జలారుపేట | ,, | 10_45 | 87 | 3_15 |
| 2_3_0 | జలారుపేట | ,, | 10_25 | తిరుపతి | ,, | 4_26 | 116 | 6_ |
| 0_6_0 | తిరుపతి | ,, | 4_26 | కాళహస్తి | ,, | 7_8 | 22 | 2_40 |
| 1_1_0 | కాళహస్తి | ,, | 10_5 | నెల్లూరు | ,, | 2_22 | 61 | 4_ |
| 2_7_0 | నెల్లూరు | ,, | 8_18 | బెజవాడ | ,, | 5_20 | 163 | 9_ |
| 5_6_0 | అంబాలా | ,, | 12_35 | సింలా | ,, | 1_13 | 110 | 12_30 |
| 5_6_0 | సింలా | ,, | 3_10 | అంబాలా | ,, | 12_10 | 110 | 9_0 |
| 2_10_0 | అంబాలా | ,, | 7_22 | లాహోరు | ,, | 144 | | 5_42 |
| 4_6_0 | లాహోరు | పగలు | 9_30 | జమ్ము | ,, | 6_ | 238 | 6_30 |
| 7_0_0 | జమ్ము | ,, | 12_30 | అంబాలా మరునాడు | ,, | 382 | | 12_10 |
| 0_2_0 | హరిద్వారం | ,, | 7_20 | హృషీకేశంరోడ్డు | ,, | 7_47 | 7 | 0_30 |
| 0_11_0 | హృషీకేశంరోడ్డు | ,, | 7_47 | డేహ్రాడూను | ,, | 9_6 | 25 | 1_30 |
| 0_13_0 | డెహ్రాడూను | ,, | 7_15 | హరిద్వారం | ,, | 10_10 | 32 | 3_0 |
| 5_0_0 | ఉజ్జైయిని | ,, | 10_0 | అజ్మీరు | ఉద॥ | 6_20 | 272 | 18_0 |



# యాత్రాస్థలములు - రైలుస్టేషనులు

× జంక్షనులు.
( ) యాత్రాస్థలములు. కానివి

| మైళ్లు. ఒక స్టేషనునుంచి రెండవ స్టేషనుకు. | యాత్రాస్థలమే రైలుస్టేషను. | యాత్రాస్థలము (బ్రాంచిరైలు స్టేషను. | మైళ్లుదగ్గర జంక్షను నుంచి. | రైలుస్టేషనుకానివి. (పైయూరునుంచి దూరము మైళ్లు.) | మైళ్లుదగ్గర స్టేషను నుంచి | విశేషములు. |
|---|---|---|---|---|---|---|
| | బెజవాడ | | | | | కృష్ణానది. కొండమీద దుర్గా మల్లేశ్వరాలయములు. |
| 11 | కొండవల్లి | | | | | కొండపైన ఖల్లా. |
| 14 | (ఎర్రుపాలెం) | | | | 76 | |
| | | | | భద్రాచలం | 50 | రాములవారి ఆలయం గోదావరినది. |
| | | | | పర్ణశాల(26) | | సీతావనవాసప్రదేశము. |
| 52 | (డోర్నకల్ ×) | సింగరేణి | 11 | | | బొగ్గుగనులు |
| 53 | వరంగల్ | | | | | ప్రతాపరుద్రుడేలిన చోటు. ఆంధ్రభాగవతము రచింపబడిన ఏకశిలానగరము. |
| 88 | శికింద్రాబాదు | | | | | |
| | | హైదరాబాదు | 5 | | | నైజాంగారి ముఖ్యనగరము. |

| | | | | | |
|---|---|---|---|---|---|
| | | | గోల్కొండ | 5 | ఖిల్లా. భద్రాచలరామదాసుగారు ఖైదుగానుంచిన చోటు. |
| 121 | (వాడీ) × | | | | |
| 129 | (కురుద్వాడీ) × పంఢరపూరు | 32 | | | విఠోబాగుడి. చంద్రభాగభీమానదులు. |
| 115 | పూనా | | | 80 | లోకమాన్యతిలకుజన్మస్థానము. కొండపైన కనకపార్వతి గుడి. |
| | (వాదారు) | 46 | మహాబళేశ్వరం | 40 | కృష్ణానది పుట్టినచోటు. |
| 39 | (లోనవ్లా) | | | | కైలుకొండలమీద కొండగుహాలలోను బోవును. ఇక్కడ దిగనక్కరలేదు |
| 80 | బొంబాయి | | | | ముమ్మాదేవిగుడి. మిక్కిలిఅందమైన పెద్ద నగరము. |
| | | | ఎలిఫాంటా | 7 | గుహాలు. సముద్రముమీద పోవలెను. |
| 117 | (నాసికురోడ్డు) | | నాసిక | 7 | గోదావరినది. పెద్దకాలవగనుండును. |
| | | | త్రయంబకం(18) | | గోదావరినది పుట్టినచోటు. త్రయంబకేశ్వరుని ఆలయము. |
| 45 | (మన్మాడు) × ఔరంగబాదా | 71 | | | |
| | | | దౌలతబాదా | 7 | కోట. |
| | | | ఎల్లోరా(6) | | ఒక్కరాతిలో చెక్కబడిన పెద్దఆలయములు |



| | | | | | |
|---|---|---|---|---|---|
| 70 | (పచోరా) × (పెండుర్ని) | 18 | అజంతా | 5 | ప్రపంచకములోన అగ్రగణ్యమగు శిల్పకళాచాతుర్యము. |
| 29 | (జల్గాను) | | | 40 | |
| 92 | (ఖాండ్వా) × (మోహుకెక్కా) | 37 | ఓంకారం | 7 | ఓంకారేశ్వరునాలయము. నర్మదానది. |
| | (ఫతేబాదు) × | 137 | | | |
| | ఉజ్జయిని =అవంతిక | 15 | | | మహాకాళిఆలయము. సిప్రానది. కాళిదాసుండిన చోటు. |
| | (రట్లం) × | 40 | | | |
| | (అజ్మీరు) | 232 | పుష్కరం | 7 | తీర్థములలో మిక్కిలి ముఖ్యమైనది. |
| | మత్రా | | | | |
| | (ఇటార్సీ) × నాగపురం | 186 | | | మధ్యరాష్ట్రముల ముఖ్యనగరము. |
| | బొంబాయి | | | | |
| 248 | బరోడా | | | | అందమైన పట్టణము. |
| 62 | అహమదాబాదు | | | | యంత్రశాలలు నిప్పుపుల్లల కర్మాగారము. |
| 42 | (మెహసేనా) | | | | |
| | సిడ్పూరు. =మాతృగయ. | 22 | | | సరస్వతీనది. తీర్థవిధిప్రదేశము. |

81 (వడ్వాన్)
75 (రాజ్కోట)
138 ద్వారక — పశ్చిమసముద్రతీరము. శ్రీకృష్ణునిర్యాణస్థలము
294 (వడ్వాన్)
40 (వీరమాగమ్)
41 అహమదాబాద్
310 బొంబాయి
464 (ఇటార్సీ)
12 హోసంగబాదు — నర్మదానది. అందమైన స్నానఘట్టము.
45 (భూపాల్)

ఉజ్జయిని. 114
=అవంతి.

169 ఝాంసీ. — చారిత్రకప్రదేశము.
133 ఆగ్రా — తాజ్మహాలు. కోట. యమునానది.
33 మట్రా — కంసవధజరిగినస్థలము యమునానది.
=మధురాపురి — మోక్షస్థానము.

గోకుల 7 — శ్రీకృష్ణుడు బాల్యమునవివాసముండినయూరు
బృందావనం 7 — కాళంగిమర్దనప్రదేశము.



గోవర్ధనగిరి 7 — భీష్ముని జన్మస్థానము.

91 డిల్లీ — హిందూదేశమునకు ముఖ్యనగరము. యమునానది.

హస్తినాపురం 12 — కురుపాండవులుండినచోటు. ఇనపధ్వజస్తంభము.

97 కురుక్షేత్రం — కురుపాండవుల రణరంగము. గీతాస్థానము.
26 (అంబాలా) ×

సింలా 110
లాహోరు. 144

(జమ్ము) 114 శ్రీనగరు. 133 — శారదాపీఠము.

88 హరిద్వారము — గంగానది. దక్షేశ్వరాలయము.
మాయాపురి
32 డెహ్రాడూను

హృషీకేశం 12 — హిమాలయపర్వతం. గంగానది.
అటవీవిద్యాశాల.

మస్సోరి
గంగోత్రి
హిమోద్రి — గంగపుట్టినచోటు

26 (హృషీకేశంరోడ్డు) దేవప్రయాగ 36

గు ప్తకాశీ 93
కేదారం 21 కేదారేశ్వరాలయము.
బదరీనారాయణం 76 లక్ష్మీనారాయణాలయము.
(బ్రహ్మకపాలం 1/8 ఆత్మపిండము వేయుచోటు.
కర్ణప్రయాగ

హరిద్వారము
2 (రామ్‌నగర్)
160 (బారిల్లీ) × 105
103 (బాలామావు) నైమిశారణ్ 16 శౌనకాదిఋషుల స్థానము. గోమతీనది.
=నైమిశారణ్యము
43 లక్నో లక్ష్మణపురి.
కాంపూరు వాల్మీకి ఆశ్రమము
81 అయోధ్య శ్రీరాములవారి జన్మస్థానము. సరయూనది.
99 అలహాబాదు పశ్చిమోత్తర రాష్ట్రముల ముఖ్యనగరం గంగానది.
2 ప్రయాగ గంగయమునసరస్వతీనదులత్రివేణీసంగమము భారద్వాజాశ్రమము.
చిత్రకూటము 85 అరణ్యవాసమున రాములవారుండినచోటు
74 కాశీ విశ్వేశ్వరాన్నపూర్ణలఆలయములు. గంగానది



137 గయ పితృదేవతలకు ముఖ్యము. ఫల్గుణీనది.
46 పాట్నా గంగానది. చంద్రగుప్తుడు రాజ్యమేలినచోటు
129 వైద్యనాథం
151 కలకత్తా హిందూదేశమున మిక్కిలి పెద్దనగరము. కాళీ ఆలయము. హుగ్లీనది.
నవద్వీపం 66 సంస్కృతపాఠశాల.
272 భువనేశ్వరం శంకరనారాయణాలయము. ఆరోగ్యస్థలము.
11 (ఖుర్దారోడ్డు) × పూరి, 27 కుండలవంటకము. జగన్నాథస్వామి ఆలయము.
=జగన్నాథము
177 (శ్రీకాకుళంరోడ్డు) శ్రీకూర్మము 14 కూర్మావతార ప్రదేశము.
81 వాల్తేరు విశాఖపట్టణం 2
సింహాచలం 9 వరాహనరసింహాలయము. మాధవధార.
86 పిఠాపురం పాదగయ.
26 (ద్వారపూడి) ద్రాక్షారామం 18 భీమేశ్వరాలయము
కోటిఫలి 6 సోమేశ్వరాలయము. గోదావరినది.
ముక్తేశ్వరం 1
13 రాజమహేంద్రవరం ఆంధ్రభాషకము ప్రారంభింపబడిన చోటు. గోదావరినది.

| | | | | |
|---|---|---|---|---|
| 4 | కొవ్వూరు | | | ఆంధ్రగీర్వాణ విద్యాలయము. గోదావరి. గోష్పదక్షేత్రము. |
| | బెజవాడ | వేదాద్రి | 50 | లక్ష్మీనరసింహస్వామి ఆలయం. కృష్ణానది. |
| 7 | మంగళగిరి | | | లక్ష్మీనరసింహస్వామి ఆలయము. గాలిగోపురం. కోనేరులు. |
| 12 | (గుంటూరు) | అమరావతి | | అమరేశ్వరస్వామి ఆలయము. కృష్ణానది. |
| 13 | (ఫిరంగిపురం) | కొండవీడు | | కోట. రెడ్డి ప్రభుత్వము చేసిన చోటు. |
| 15 | (నరసారావుపేట) | కోటప్పకొండ | | త్రికూటేశ్వరుని ఆలయము. |
| 23 | వినుకొండ | { శ్రీశైలం | 64 | శ్రీభ్రమరాంబా మల్లేశ్వరుల ఆలయములు. |
| 39 | మార్కాపురం రోడ్డు | | 56 | పాతాళగంగ. అరణ్యప్రాంతము. |
| 70 | (గాజులపల్లి) | మహానంది | 4 | నందికోటనుంచి జలము వచ్చును. |
| 9 | (నందియాల) | | 9 | |
| | | అహోబిలం | 24 | నృసింహస్వామి ఆలయము. కొండ. అరణ్యము |
| 48 | ద్రోణాచలం (కర్నూలు) | 32 అలంపూరు | 8 | జోగులాంబా శక్తి ఆలయము |
| 43 | (గుంటకల్) × (హొస్పేట) | 71 హంపివిరూపాక్షం | 7 | తుంగభద్రానది. కృష్ణదేవరాయలు రాజ్యమేలినచోటు. గోపురము. విద్యారణ్యులు భాష్యములు వ్రాసినచోటు. |
| | (హుబ్లి) × | 89 గోకర్ణము | 128 | మహాబలేశ్వరుడు |





| | | | | |
|---|---|---|---|---|
| | మిరాజు 173 | | | |
| | కొల్హాపురం 30 | | | మహాలక్ష్మి శక్తి |
| 114 | (కడప) | పుష్పగిరి | 8 | పీఠస్థానము |
| 86 | తిరుత్తని | | | కుమారస్వామి. |
| 25 | తిరువళ్ళూరు | | | వీరరాఘవస్వామి. కోనేటిలో బెల్లము వేయుట. |
| 26 | చెన్నపట్టణం | | | పార్థసారథిస్వామి సముద్రము. |
| 35 | (చెంగల్పట్టు) | పక్షితీర్థం | 10 | వేదగిరీశ్వరుడు 2 పక్షులు ప్రతిదినము 11 గంటలకు వచ్చుట. |
| | | మహాబలిపురం | 9 | ఒక్కరాతిలో చెక్కిన 7 దేవాలయములు. |
| | కంచి 22 | | | ఏకామ్రేశ్వరుడు వరద రాజస్వామి సర్వతీర్థము. పృథివీలింగము. |
| 64 | (విల్లుపురం) × తిరువన్నామలై =అరుణాచలం 42 | | | అరుణాచలేశ్వరుడు. జ్యోతిర్లింగము. |
| | పాండిచ్చేరి =పుదుచ్చేరి 19 | | | చక్కని పట్టణము. భూగర్భమునుంచి నీరు గొట్టములగుండా పైకివచ్చును. |
| 52 | చిదంబరం | | | ఆకాశలింగం. విఘ్నేశ్వరుడు. |
| 16 | సీర్కాళి | | | సబ్రహ్మణ్యేశ్వరుడు. |
| 23 | మాయవరం | | | మయూరనాథుడు. కావేరీనది. |

| | | | | |
|---|---|---|---|---|
| 20 | కుంభకోణం | | | కుంభేశ్వరుడు. సారంగపాణి. కావేరీనది. |
| 24 | తంజావూరు | | | బృహదీశ్వరుడు. చక్కని దేవాలయము. కావేరినది. |
| 31 | తిరుచునాపల్లి | | | కొండపైనశివలింగము. కావేరినది. |
| | | పుదుకోట | 32 | అందమైన పట్టణము. |
| | | శ్రీరంగం | 2 | రంగనాయకస్వామి. కొల్లిడంనది. |
| | | జంబుకేశ్వరం | 1 | జలలింగం. |
| 37 | (డిండిగల్) | పలనీ | | సుబ్రహ్మణ్యేశ్వరుడు. |
| 62 | మధుర | | 40 | |
| 55 | (రామనాడ్) | నవపాషాణం | 9 | ఇసుకతో జేసిన నవగ్రహము లు సముద్రములో గలవు. |
| | రామనాథపురం | దర్భశయనం | 9 | రాములవారు వారధికట్టినచోటు. |
| 41 | రామేశ్వరం | | | రామలింగస్వామి. మిక్కిలి పెద్దఆలయము. |
| 11 | ధనుష్కోటి | సేతు | 3 | |
| 107 | మధుర | | | మీనాక్షి సుందరేశ్వరులఆలయమ్ములు |
| 79 | (మణియాచి) | | | |
| 63 | తెంకాశి | పాపనాశనం | | శివక్షేత్రము. రాములవారుపూజించినచోటు. |
| | | జనార్దనం | | |



| | | | | |
|---|---|---|---|---|
| | | తోతాద్రి | | |
| | | కన్యాకుమారి | | |
| 101 | త్రివెంద్రం | | | అనంత పద్మనాభస్వామి |
| | అనంతశయనం | | | |
| | (కాలికట్) | | | |
| 137 | (మంగుళూరు | ఉడిపి | 33 | మాధ్వమఠము. |
| | | సుబ్రహ్మణ్యం | 40 | సుబ్రహ్మణ్యేశ్వరుడు. |
| 137 | (కాలికట్) | | | |
| 53 | (షోరనూరు) × | కాలటి | 2 | శ్రీశంకరాచార్యస్వామివారిజన్మస్థానము చల్లనిప్రదేశము. |
| 58 | (పోదనూరు) × ఊటీ 55 =ఉదకమండలం | | | |
| 170 | (జలారుపేట) × బెంగుళూరు. 87 | | | అందమైనపట్టణము. |
| | మైసూరు (87) | | | రాజభవనము. చాముండేశ్వరుడు. |
| | బెంగుళూరు(87) | | | |
| | బీరూరు(131) | | | |
| | (తరికేరి) (16) | | | |
| | (నరసింహారాజపురం(27) | శృంగేరి | 24 | శంకరమఠము. |
| 32 | (కాట్పాడి) × | | | |

| | | |
|---|---|---|
| 39 | (పాకాల) × | |
| 25 | తిరుపతి | శ్రీవేంకటేశ్వరస్వామి. 7 కొండలు. నీటిధారలు. |
| 7 | (రేణిగుంట) × | |
| 14 | కాళహస్తి | శ్రీకాళహస్తీశ్వరుడు. సువర్ణముఖీనది. |
| 37 | (గూడూరు) × | |
| 24 | నెల్లూరు | శ్రీరంగనాయకస్వామి. పెన్నానది. |
| 163 | బెజవాడ | |


హిమాలయపర్వతము
సింధునది
వింధ్యపర్వతము
తపతీనది
గంగానది
ఆరబ్బి సముద్రము
బంగాళాఖాతము
లంక
హిందుమహా సముద్రము
హిందూదేశము

గ్రంథకర్తచే రచింపఁబడిన

## ఇతర పుస్తకములు

శ్రీ బమ్మెరపోతనామాత్యుఁడు. 200 పుటలు. రు. 1-0-0

ఈపుస్తకము 1926 సంవత్సరం బి. ఏ. పరీక్షకు నియమితగ్రంథము.

అమెరికా వర్తక చరిత్ర. 64 పుటలు. రు. 0-4-0.

